Osmania University Magazine

(TELUGU SECTION)




సత్యం శివం సుందరం



ఉస్మానియా విశ్వవిద్యాలయము

JANUARY 1951

Vol. II No. 1

# సంచికాసమితి

## 1951

1. అధ్యక్షుడు:

శ్రీ.ఎం. ఎస్. దొరైస్వామి, బి. ఏ. (ఆక్సన్), ఎం. ఏ. ఎల్. టి. (మద్రాసు) శాఖాధిపతి, ఆంగ్లశాఖాధ్యక్షులు.

2. గౌరవ కోశాధిపతి:

మిస్టర్. మహమ్మద్ బిన్ ఉమర్, ఎం. ఏ., ఆంగ్లోపన్యాసకులు.

3. ఇతపతి: ఆంగ్లవిభాగము.

శ్రీ. కె. ఆర్. చంద్రశేఖరన్, ఎం. ఏ., ఆంగ్లోపన్యాసకులు.

4. ఇతపతి: హిందీవిభాగము.

శ్రీ. పండిత వంశీధర విద్యాలంకార్.

5. ఇతపతి: తెలుగువిభాగము.

శ్రీ. ఖండవల్లి లక్ష్మీరంజనము ఎం. ఏ., ఆంధ్రశాఖాధ్యక్షులు.

6. ఇతపతి: ఉర్దూవిభాగము.

శ్రీ అబ్దుల్‌ఖాదర్ సర్వరీ. ఎం. ఏ. ఎల్. ఎల్ బి., ఉర్దూ శాఖాధ్యక్షులు.

7. ఇతపతి: మరాఠీవిభాగము:

శ్రీ. ఆర్. ఎం. ఘాసాతి, ఎం. ఏ. మరాఠీ శాఖాధ్యక్షులు.

8. ఇతపతి: కన్నడవిభాగము:

శ్రీ. డి. కె. భీమసేనరావు ఎం. ఏ., కన్నడశాఖాధ్యక్షులు.

సంపాదకవర్గ ప్రతినిధులు:—

1. మొఘనితబస్సుమ్
2. మాణిక్యరావు ధన్వట్కర్
3. నారాయణరావు.

ప్రధానసంపాదకుడు:

టికం చంద్ జైన్, ఎం. ఏ. (ప్రథమ)

ఉపప్రధాన సంపాదకుడు:

బి. రాంరాజు ఎం. ఏ., (ద్వితీయ).



శివం

సత్యం … సుందరం

"దేశభాషలందు తెలుగు లెస్స"

# శోభ

ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థుల

## అర్ధ వార్షిక సంచిక



ఇతవరి

శ్రీ. ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఎం. ఏ.

ఆంధ్రశాఖాధ్యక్షులు.



సంపాదకుడు

పి. రామకృష్ణారావు. ఎం. ఏ. (ప్రథమ)



సహాయసంపాదకులు

డి. వెంకటేశ్వరరావు. బి. ఇ. (ద్వితీయ)

వి. శేషభూషణరావు. బి. ఎస్సి. (ప్రథమ)

సంపుటి ౨ సంచిక ౧

వికృతి—పుష్యము

(జనవరి 1951)

సర్వోదయప్రెస్, హిల్ స్ట్రీటు:సికింద్రాబాదు.

చందాల వివరము :

| | |
|---|---|
| విద్యార్థులకు | 0—8—0 |
| ఇతరులకు | 1—0—0 |



" దేశభాషలందు తెలుగు లెస్స. "

# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| 1. | సంపాదకీయము. | .... .... .... .... | 1 |
| 2. | స్వాగత పద్యములు. | .... శ్రీ. ఖండవల్లి లక్ష్మీరంజనముగారు. | 3 |
| 3. | కావ్యేషునాటకం రమ్యమ్. | .... బి. రామరాజు. | 5 |
| 4. | వ్యధితహృదయం. | .... "ఈశ్వర" | 7 |
| 5. | భారతదేశ తటస్థవైఖరి. | .... పి. ఎల్. నరసింహారావు. | 8 |
| 6. | ఆహారధాన్యముల ఉచితసంరక్షణము. | .... జి. కృష్ణనారాయణ. | 10 |
| 7. | శిథిలజీవులు. | .... యం. వి. నాగభూషణరావు | 12 |
| 8. | ఆంధ్రమేఘ సందేశము. | .... శ్రీ వెల్లలూరు వేంకటరాఘవశర్మగారు. | 14 |
| 9. | లలితకళలు. | .... బి. కమలా మనోహరరావు. | 16 |
| 10. | లీల. | .... ఎం. ఎస్. కుమారస్వామి | 17 |
| 11. | నేపాల్ కల్లోలం. | .... కె. వి. అప్పారావు. | 21 |
| 12. | సైన్సు—మానవుడు. | .... జి. శేషభూషణరావు | 24 |
| 13. | హృదయావేదన. | .... సి. నారాయణరెడ్డి. | 26 |
| 14. | సామ్యవాదము——ప్రజాస్వామ్యము. | .... ఎం. రామమోహనరావు | 28 |
| 15. | తుమ్మెదా! | .... సి. నారాయణరెడ్డి. | 29 |
| 16. | నాబిడ్డ. | .... బి. శ్రీధర్‌రావు. | 30 |
| 17. | వరూధిని——సత్కారము. | .... శ్రీ కోపూరు గోపాలకృష్ణారావుగారు. | 32 |
| 18. | స్వార్థత్యాగము —— | .... బి. రామరాజు | 36 |
| 19. | ఆంధ్ర విద్యార్థి సంఘనివేదిక. | .... (కార్యదర్శి) | 37 |
| 20. | గ్రంథ సమీక్ష. | .... .... .... .... | 39 |




# గమనిక

ఈసంచికలో ప్రచురింపఁబడిన ఉత్తమరచనలకు రెండు బహుమతులు ఒసఁగబడును. "స్వార్థత్యాగము" "శిథిలజీవులు" అనురచనలు ప్రథమ, ద్వితీయములుగా నిలిచినవి.

30 రూ. ప్రథమ బహుమానము.

బి. రామరాజు (ఎం.ఏ. ద్వితీయ) గారికి.

20 రూ. ద్వితీయ బహుమానము.

ఎం. వి. నాగభూషణరావు. (బి. వి. యస్సి) గారికి.



రాబోవు సంచికలో ప్రచురింపఁబడు ఉత్తమ రచనలకు మూడు బహుమతులు:-

ప్రథమ బహుమానము 50-0-0 రూ.

ద్వితీయ బహుమానము 30-0-0 ,,

తృతీయ బహుమానము 20-0-0 ,,

కావున విద్యార్థి సోదరులందఱును ఆగామిసంచికకై తమ ఉత్తమ రచనలు పంపుదురని యాశించుచున్నాము.

సంపాదకుఁడు.

# సంపాదకీయము



కాలమున కనుగుణముగ పరిణమించి తమ ప్రాత వ్యక్త్వమునుమార్చు కొనురాజ్యములు చిరస్థాయులుగా మనజాలవు. ఎంతకాలము అవి భవిష్యత్తును తమలో ప్రతిఫలింపఁజేయుచు భవిష్యత్తున కభిముఖముగా పరిణమించుచుండునో అంతవరకు అవి చైతన్యపూర్ణములుగా నుండును. వాస్తవికతను తిరస్కరించి తమ స్థిరత్వమును సర్వకాల సర్వావస్థలయందు స్థాపింపఁ దలఁచుట పొరపాటు. భవిష్యత్తులో అట్టిదానికి స్థానముండదు....మనసంస్థానము తుదకు వాస్తవికతను గుర్తింపు గత్యంతరములేక భారతదేశమును "దాసోహ" మన్నది. ఆనాఁటి నుండి రాష్ట్రములో గణనీయములైన సంస్కరణములు పెక్కు లేర్పడినవి. నేఁడు ప్రజాప్రతినిధులగు ప్రతిభావంతులైన మంత్రులు సుపరిపాలనముచేత ప్రజా హృదయములను చూఱగొనుచున్నారు. రాష్ట్రము నల్గడల సుస్థిరత, ప్రశాంతి నెలకొల్పుటకు ప్రయత్నములు బహువేగముగ జరుగుచున్నవి. ఉత్సాహపూరితులును, జాతీయ విధేయులు వారలును, స్వాతంత్ర్యమునకార్జనకై సర్వస్వము ధారపోసిన త్యాగమూర్తులు నగు ఈ మంత్రులు ఉజ్జ్వలమైన భవిష్యత్తుతోపాటు వర్తమానమున శాంతి సౌభాగ్యములు ప్రజలకు ప్రసాదింతురని నమ్ముచున్నాము.

కడచిన ఐదు సంవత్సరములలో "శోభ" కన్య చక్కని పరిపోషణ లేమిచే వీనిబిడ్డవలె సహజ సౌందర్యమును ప్రకటింపలేకుండెను. కాని వికృతి చైత్రమునుండియు ఈ కన్య నూతన కిసలయశోభితమై యలరారుచున్నది.

గత సంవత్సరము శోభను ప్రప్రథమముగ అచ్చొత్తించు ప్రయత్నములు సఫలమగుటకే చైత్రమాసము వచ్చినది. ఇంక సంవత్సరములో వెలువడు రెండు సంచికలను ఒకే పర్యాయము ప్రచురింపఁబడినవి. ఇప్పుడు మా పాఠకుల కందిచ్చు నీసంచిక మూఁడవప్రసూనము.

ఇక నేఁడు విపుల వాఙ్మయ సీమలందు నొకచోట మధురకంఠముల నెత్తి పాడు నెలమేటి పిచికల నినాదములు, నింకొకచోట నిరంతరము లేక వినోదము సంఁదేలు ఇక, మయూరాలాపములను వెలలేఁగియుండు మృదుభాషణముల ముగ్ధ టాడుచు, ముద్దుపెంపు పలుకులతో చిటిపొటి నడకతో. నానావిధవాణీరుచులను నెలపుచు "శోభ" కన్య తెలుఁగు సారస్వతారామములో స్వేచ్ఛగా పయనించుచున్నది.

ఈ సంవత్సరము రెండు సంచికలు వెలువడుచున్నవి. ప్రాంతీయభాషలలో ప్రచురింపఁబడు, తెలుగు, కన్నడ, మహారాష్ట్ర పత్రికలకొఱకై ఇప్పుడు 40 పుటలు మాత్ర మిచ్చుటకు విశ్వవిద్యాలయాధికారివర్గ మంగీకరించినది. కావున గత సంవత్సరమువలె పెద్ద అచ్చులో ముద్రింపించిన యెక్కువ రచనలు ప్రచురించుటకు వీలుకాదని చిన్న అచ్చులో ముద్రింపించినాము.

వీలైనంతవఱకు విద్యార్థుల ఉజ్జ్వలతర రచనలను ఎక్కువ ప్రచురించుట. విశ్వవిద్యాలయములో ఇట్టి సుప్రసిద్ధ యువక రచయితలున్నారని ఆంధ్రలోకమున

కెలుకపఱచుట, విద్యార్థి సోదరులకు మాతృభాషయందు అభిరుచి గల్పించుట, మొదలగునవి "శోభ" ముఖ్యోద్దేశములు. ఈసంచికకై పెక్కు ఉత్తమరచనలందినవి, కాని స్థలాభావముచేత అన్ని రచనలు శోభలో ప్రకటింపఁజాలక పోయితిమి.

ఉగ్గుపాలతోడ నలవడిన భాషలో ఎట్టి కఠిన శాస్త్రములైనను బోధించినచో నవి త్వరితముగా మనస్సున నత్తుకొని జనుల యున్నత స్థితికి కారణమగును: ఉన్నత పాఠశాలలందు వలెనే కళాశాలలయందు మాతృభాషలో విద్యాబోధనము జరుఁగుటలేదు. అట్లు జరిగిననేగాని పురోభివృద్ధికి మార్గముఁగానరాదు. ఇక మన విశ్వవిద్యాలయమునందును అనుబంధ కళాశాలలయందును మాతృభాష కనీసము అభిమాన భాషగ నైన బోధనము జరుఁగుట మువావహమె: మనభాషకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు కలదని యెఱుంగక నేఁడు మనజాతివారనేకులు మాతృభాషను పూర్తిగా విస్మరించుచున్నారు. అటులైనచో వీరికి నైతికమోక్షము మఱియు స్వాతంత్ర్య మెక్కడిది? ఐహికసుఖానంద మంతకును లభించమగదా! ముసుముందైనను వీరు వాస్తవికతను గుర్తింతురుగాక!! ఏజాతియైనను. వివిధ ప్రభుత్వ పరిపాలనకు లోనై యున్నచో నది రాజకీయ, సాంఘిక, నైతిక రంగములందు వెనుకబడియుండుటయేగాక తన సంస్కృతియందలి ఐక్యతను చాలవఱకు బోగొట్టుకొనుట సహజము. మూడున్నఱకోటి ఆంధ్రులు ఏకప్రభుత్వముక్రింద నివసింపకున్నను వారి సంస్కృతి, చరిత్ర, అభిన్నతమునే జూపుచున్నది. రాజకీయముగ ఆంధ్రులందఱును ఒకే త్రాటిపై నడచిననాడు మన భాష, సంస్కృతి బాగుపడగలవు. ప్రతి ఆంధ్ర విద్యార్థియు తనజాతిని ఏకప్రభుత్వముక్రిందికి తెచ్చుటకై ఉద్యమము సాధించి, తద్వార ఆంధ్రభాషాభివృద్ధికై సర్వవిధముల తోడ్పడునని యాశించుచున్నాము.

ఉస్మానియ విశ్వవిద్యాలయములో నేఁడు ఆంధ్రవిద్యార్థిసంఘమునకొక ప్రత్యేకస్థానమున్నదని చెప్పవచ్చును. విద్యార్థులలో పరస్పర సహకారభావము, మాతృభాషాభిమానము, చైతన్యము పెంపొందించుటయే ఈ సంఘముయొక్క ముఖ్యాదర్శము. ఈ సంవత్సరమున ఆగస్టు 3వ తేది పైసంఘపు ఎన్నికలు జరిగినవి. డిసంబరు 9, 10, 11 తేదులలో వివిధ కళాశాలలఆంధ్రవిద్యార్థిసంఘ పక్షమున ఆంధ్రాభ్యుదయోత్సవములు విశ్వవిద్యాలయములో జరిగినవి. ఇంత విజయవంతముగ కొనసాగినందులకు అన్ని కళాశాలల తెలుఁగు సంఘములును అభినందనీయములు.

మన విశ్వవిద్యాలయములో విద్యార్థినులసంఖ్య అత్యల్పమైననుగణనీయమె. వీరు "శోభ" తో తప్పక సహకరింతురని విశ్వశించుచున్నాము.

ఉత్తమరచనలిచ్చి మాతో సహకరించిన మిత్రులకు కృతజ్ఞతలు. అడిగినంతనే అనుగ్రహించి అమూల్యరచనలిచ్చిన ఆచార్యవర్యులకును ఇతవరులగు ఆచార్య: ఖండవల్లి లక్ష్మీరంజనముగారికిని కృతజ్ఞతాపూర్వక వందనములు.

# అశ్రుతర్పణం

ఆంధ్రభాషాసేవను బహుముఖములుగ గావించిన ధన్యమూర్తులు పండిత ప్రకాండులును అగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యాకస్మికాస్తమయ వార్త విని యావదాంధ్రదేశము యఖండ సంతాపమునకు లోనయినది. శ్రీ శాస్త్రిగారు గొప్ప కవులు, బహుగ్రంథకర్తలు. వీరు నిష్పక్షపాతబుద్ధితో కేవలము సత్యనిర్ణయమునకయి పూను విమర్శకులు. ఆంధ్రసారస్వతమున కత్యంతము చిరస్మరణీయములగు సేవను గావించిన వారిట్టు లస్తమించుట మన దురదృష్టము. వారికి మా బాష్పాంజలి.

---

జీవితమంతయు భారతాభ్యుదయమునకై అంకితమొనర్చిన మహామహుడు, ఋషిపుంగవుడు నగు శ్రీ అరవిందుడు మున్ముందుగ ఆధ్యాత్మిక సేవారంగములో మందారముల మాధుర్యములను నింపి కిమ్మ దేహమును చాలించినారు. వారికి మా జోహార్లు.

---

భారత స్వాతంత్ర్య సమరయోధుడు, నవభారత నిర్మాత సర్దార్ వల్లభాయ్ పటేల్ నిర్యాణవార్త భారతీయులందరిని హతంగొల్పినది. 1931 నాటి సత్యాగ్రహము, శాసనోల్లంఘనోద్యమము లీమహనీయుని నిర్వహణమునకు చక్కని నిదర్శనములు. భారతస్వాధీనతావతరణ తరుణమున దేశము నసంఘటితపరచి సంస్థానసమస్యా పరిష్కారము చేసిన ప్రతిభాసంపన్నుడైన రాజకీయవేత్త ఈతడె. దేశభక్తి, స్వార్థరాహిత్యము, వజ్రసంకల్పము, చిత్తశుద్ధి, రాజకీయ చతురతయు ఈతనికి వెన్నతోబెట్టిన విద్యలు. ఈ భారత వీరుని అస్తమయము స్వతంత్ర భారతచరిత్రలోని ఒక అధ్యాయ సమాప్తము: ముఖ్యముగ శైశవ స్వతంత్రభారతమును బలీయమొనర్చి కాపాడునని ఆశతోనున్న మనకు సర్దార్ పటేల్ మృతి ఒక తీరని లోటు. వారి ఆత్మకు శాంతి చేకూరుగాక.



ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్ర విద్యార్థిసంఘ ద్వితీయ వార్షిక

ప్రారంభోత్సవ సందర్భమున

విద్యా, భూమాదాయశాఖా మంత్రులు

## గౌ. శ్రీ బూర్గుల రామకృష్ణారావు పంతులుగారికి

# స్వాగత పద్యములు

ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఎం. ఏ.

స్వాగతము మంత్రివర్య సుస్వాగతంబు
ప్రేమమధుపరిభరితమౌ హృదయములను
తెచ్చినారు విద్యార్థు లతిథి కటంచు
ఆదరాశీః పురస్సర మనుభవింపు.

ఒకనాడు నీవును మొకరి తుమ్మెదపింఛు
తెగజూచు క్రాపింగు దిద్దినావు;
ఒకనాడు నీవును గికురించి పాఠ్యంబు
చాటుగా నవలలు చదివినావు;
ఒకనాడు నీవును ఒజ్జల చిత్రాలు
చల్లగా దించితి వుల్లములర;
మనసు కిళ్ళెము త్రెంచి మసరెకి కనులతో
కోమల రూపముల్ గ్రోలినావు;

ఒక్కనాడు పరీక్ష కొద్దిగ్రక్కుమంట
కంట వత్తికొనుచు గ్రంథ కంటి.
తునికి పాట్లను తేలును మునిగినావు
కాంచు మదియెల్ల నీ సభా కావ్యమందు.

ప్రాణము లేచివచ్చెగద, భవ్యకళాద్యయనైక చిత్త పా
రీణము, హాస్యమంజుల సరల్లహరీ సుశయానమున్ జగ
త్త్రాణ విధాన కల్పిత నిరంతర సూత్రము, కార్యమం దవి
ద్రాణము, నూత్న యౌవనము దానిఎరంగుల ప్రొద్దులెంచెదే.

చిక్కగింజయంత చిన్న బీజము నుండి
మహాని విస్తరిలు మఱ్ఱివోలె
ఉయ్యాలందు నిసుగు, ఉర్వి యేలుపటంచు
తల్లి గాంచు కలలు తథ్యమయ్యె.

ఇది తుది వర్ణహీనత వహించిన బూరుగెకాని శాల్మలీ
పృథు జగతీరుహంబు గతి భీకరవాత వికంపితాంగియై
మొదలున గూలబోదు మఱిమొక్కలమై నిజమందు కొండయై
విదితము భోరుగల్గుటను వీరిది బూర్గుల వంశమయ్యెడిన్.

రాముడంచును నిను నేను రహిని బొగడ
కృష్ణుడంచును సత్యుక్తి కెలనబోవ
రామకృష్ణ పాదాంబుజ రమ్యనళిన
శరణ మానస సంసార శాలివంచు

అక్కన మాదనల్ మహితులాంధ్రుల రాచరికంపు శేముషిన్
ముక్కున ప్రేలువేసికొని మ్రొక్కులిడంగను జేసి రన్యులన్
అక్కట నాడు నేటికి శతాబ్దములంబడి మ్రోడువారుచున్
స్రుక్కిన చెట్టు మోసులిడె రోకలి కూడ చిగుర్చునే గదా!

ఓడల బండ్లు వచ్చెడి నహో! సులతానుల కన్నుసైగలన్
జాడల మెల్గిరా ఘనులు: సత్యము నీ కనుసన్నలన్ ప్రజా
పీడన దుర్ణయుల్ మెలగి వేచియ యుందురు రామకృష్ణయా!
తోడు గదారు నీ ప్రజలు తోలుమ నీతిరథంబు చక్కటన్.

న్యాయము సంఘమానవుల నాణ్యముగా జతగూర్చు సూత్రమౌ
పాయని ధర్మమీ ప్రకృతి బంధుర దివ్య కళా వి బంధమౌ
నీయుగళంబు గల్గినను నెందుకయా అణుబాంబు ముచ్చటల్
ఈ యుగళంబులేని యిక నెందుకయా ఉదబాంబు సందడుల్.

# "కావ్యేషు నాటకం రమ్యమ్"

★ బి. రామరాజు ఎం. ఏ. (ద్వితీయ) ★

నాటకము కావ్యములందు రమ్యమైనదని సిద్ధాంతీకరించుటకుఁ గావ్యమన నేమి? నాటకమన నేమి? లోక కల్యాణమునకుఁ గవి యెట్లుపకరించును? ఈ విషయమున కావ్యముసకంటె నాటకమున నున్న వైశిష్ట్యమేమని ముందుగావిచారింపఁ దగును.

శాస్త్రము ననుసరించి అతీంద్రియమైన ధర్మతత్త్వమును జ్ఞానదృష్టిచేఁ గనుఁగొని దాని నట్లే చెప్పినవాఁడు ఋషి లేక కవి. "కవేః కర్మ కావ్యమ్" కవియొక్క కర్మ కావ్యము. "నా నృషిః కురుతే కావ్యమ్" ఋషి కాని వాఁడు కావ్యకర్త కాఁజాలఁడు. కావ్యలక్షణ ప్రతిపాదనయందు భిన్న భిన్న వ్యక్తులు కావ్యమును భిన్నముగా నిర్వచించిరి.

"అదోషౌ సగుణౌ సాలంకారౌ" అనియు "రీతిరాత్మా కావ్యస్య" యనియు "కాంతాసమ్మిత తయోపదేశ యుజే" యనియు మల్లినాథ వామన మమ్మట ప్రభృతి లాక్షణికులును, "రసాత్మకం వాక్యం కావ్యం" "రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమ్" అని రసవాదులైన విశ్వనాథ జగన్నాథ పండిత రాయలు మున్నగువారును నిర్వచించిరి. నిర్వచనము లెట్లున్నను "కావ్యం యశసేఽర్థ కృతే వ్యవహార విదే శివేతర క్షతయే సద్యః పర నిర్వృత యే కాంతాసమ్మిత తయోపదేశ యుజే" యను మమ్మటోక్తి "విశ్వ శ్రేయః కావ్యమ్" అను వాగనుశాసనుని సూక్తి కావ్యప్రయోజన విషయమున సర్వత్ర యంగీకృతములు.

> " దృశ్య శ్రవ్యత్వ భేదేన పునః కావ్యమ్ ద్విధామతం
> దృశ్యం తత్రాభినేయంస్యాత్ తద్రూపారోపాత్తురూపకం॥
> భవేదభినయో వస్థానుకారః స చతుర్విధః
> ఆఙ్గికో వాచికశ్చైవ మాహార్యస్సాత్త్వికస్తథా॥"

కావ్యమునం దెన్నియో భేదములున్నవి. మరల కావ్యము దృశ్యమని శ్రవ్యమని రెండు విధములు. అందు దృశ్యకావ్యమభినయింపఁబడును. రామాది నాయకుల రూపము నటుల యందారోపింపఁ బడుటవలన రూపకమని చెప్పఁబడును. (అభినయమనఁగా నవస్థల ననుకరించు విధానము. ఆంగికము వాచికము, ఆహార్యకము- సాత్త్వికము ననునవి చతుర్విధాభినయములు). విని యానందింపఁదగిన పురాణములకంటెను జదివి సంతోషింపఁదగిన శక్తియున కావ్యములకంటెను బండిత పామర సాధారణముగా నాయికా నాయకుల యుదంతము చూచి యానందింపఁదగిన దగుటచే రూపక ముత్తమోత్తమని పూర్వులు ప్రశంసించిరి. ఒకజాతియొక్క సాంఘిక రాజకీయ చరిత్ర ఆ జాతి నాటక వాఙ్మయమునందుఁ బ్రతిబింబించును. ఆ జాతీయుల బుద్ధివైభవము మనోవ్యాపార రీతుల వారి నాటకరచనను పరిశీలింపక చక్కఁగా నవగాహన చేసికొనము. కావుననే నాటకరంగము లాయా ప్రజల నాగరకత కద్దములవంటివనుట అతిశయోక్తి కానేరదు. "సైరక్యూజు" ప్రభువైన "డయోనీసియసు" అనునతఁడు "ఏథెన్సు" నగరము యొక్క నాగరకతను గురించియు వాఙ్మయాభివృద్ధి గురించియుఁ దెలిసికొనఁగోరియుండఁగా "ప్లేటో" విద్వాంసుఁడు "అరిస్టోఫేన్సు" అను నాతని సుఖాంతనాటకము నారాజునకు బంపి దీనినుండియే "ఏథెన్సు" ప్రజల స్వభావ తత్త్వములను నీవు గ్రహించుకొనఁగలవని సమాధానమిచ్చెనఁట. అట్లే మృచ్ఛకటిక నాటకము తదితర గ్రంథములకన్న మిన్నగా ఆనాటి భారతీయుల నాగరికతను స్వభావమును జక్కఁగ బ్రతిఫలింపఁజేయును. కళాసృష్టిలో నాటకములును నాట్యరంగములును బ్రజల నైతిక చిత్తవృత్తులమీదఁ గొప్ప ప్రభావము గలిగి యున్నవి.

ఇదే నాటక వైశిష్ట్యము. మొదట బహుకావ్యములు మొదల్చి పిదపట నాటకము చదివి యుంచలి రసము పూర్తి గ్రహింపఁబడుయే సాహిత్య పరమావధికి గుర్తను తలంపుతో "నాటకాంతం హి సాహిత్యం" అనియు కవి యగువాడు మున్ముందేవేని కావ్యములు రచియించి మెప్పుగాంచి లోకానుభవశాలియై పిదపట నాటకము రచించుననెడి సత్యము దెలుపుట "నాటకాన్తం కవిత్వం" అనియు నే యితర కృతులు నాటకము వలె మనోహరములు గావనుటకే "కావ్యేషు నాటకం రమ్యం" అనియు పూర్వోక్తులు వెలసినవి. ఈ నాటకోత్కృష్టతను సమగ్రముగాఁ బరిశీలించుటకు నాటకోత్పత్తి తత్త్వముల జ్ఞానము నాది నత్యంతావశ్యకము.

భారతీయ నాటక సంప్రదాయములఁ దెలుపుటకు ప్రథమ గ్రంథము భరతాచార్యుల నాట్యశాస్త్రము. నాట్యవేదము గాంధర్వవేదముగూడ వేదముల కనుబంధముగా బ్రహ్మ నిర్మింపఁబడెనని భరతనాట్యశాస్త్రము ఘోషించుచున్నది. దేవతలొకప్పుడు నేత్రములకు కర్ణములకు రెంటికి వినోదము గూర్చు దానిగ నేదైన సృజించుటకు బ్రహ్మను వేడుకొనిరట. ఈ నూతన వేదము ఇదివరకు వెలసిన చతుర్వేదములవ

ద్విజాతులకు మాత్రమే యుపాస్యముగాక శూద్రాదులకుఁగూడ నందుబాటులో నుండవలెనని కోరిరఁట. అప్పుడు చతుర్ముఖు డితిహాసమును నీతిబోధమును జోడించి మనుష్యులకు కర్తవ్యము బోధించగల పంచమ వేదము నాట్యవేదమను పేర సృజించెనఁట. బ్రహ్మ ఋగ్వేదమునుండి పాఠ్యమును సామవేదమునుండి గానమును యజుర్వేదమునుండి అభినయము లను నథర్వణవేదమునుండి రసములను గ్రహించి ఐదవ నాట్యవేద మగాఁ జేసి విశ్వకర్మచే నాట్యశాలా నిర్మాణము గావించి భరతమునిచే దేవలోకమున బ్రదర్శింపఁజేసెనఁట. ఈ పంచమ వేదమునకు శివుఁడుద్ధతమైన తాండవమును పార్వతి కోమలమైన లాస్యమును విష్ణువు నాట్యమున కవసరమైన చతుర్విధ వృత్తుల నొసఁగిరఁట. భరతమునియె యీ నాట్యశాస్త్రమును భూలోకమునఁ బ్రచార మొనరించెనఁట.

ఈ వృత్తాంతము ననుసరించి హైందవ దేవతావర్గము లోని త్రిమూర్తులును నాటకోత్పత్తితో సన్నిహిత సంబంధ ముండుట నీతత్వాసక్తత్వ వైశిష్ట్యములను సూచించును. మఱియు నాట్యశాస్త్రము తానే పంచమ వేద మనుకొనుట గమనింపదగిన విషయము. మహాభారతమునకిట్టి వ్యవహారము కలదు. ఇతిహాసమును దనలో నొక యంశముగ చేసికొని నాట్యశాస్త్రము పంచమవేద ప్రశస్తిని తనలో సమన్వయించుకొన్నది. కావ్యము నవల నాటకము ఈ మూడింటికి నితిహాసమే యాధారమైనను వానియందుఁ బరస్పర భేదమున్నది. కావ్యమున చరిత్ర చిత్రణ ప్రాసంగిక విన్యాసమేగాని ప్రకృతి ఋతువులు మానవ చిత్తవృత్తి వర్ణనా వైదగ్ధ్యమే ప్రాధాన్యము వహించును. ఇఁక నవలయందన్ననో ఏదో యొక చరిత్ర ననుసరించి మనోహర కథాకల్పనము ముఖ్యము. కథ ఎంత హృద్యముగను నెంత చిత్రముగను నున్న నవల యంత యుత్తమముగా నుండును. దీనినే "మహారిక సత్కవి కల్పనా విభూషావహ పూర్వ వృత్తమగు నానలఁదీరిన జాతిరత్న" మనవచ్చును. నాటకమీ రెంటికన్న వేఱు. అందు కావ్యమం దుండఁదగిన కవిత్వమును నవలయందుండఁదగిన మనోహర కల్పనయు నుండవలసినను కథాభాగమున నేకత్వము ఘటనా సార్థకత ఘాత ప్రతిఘాతము స్వాభావికత యను విశేషములే నాటక వివిధకళా సమ్మేళనము జరిగి తీరును.

> " ఇతవృత్తంహి నాట్యస్య శరీరం పరికల్పితం
> యోయం స్వభావో లోకస్య నానావస్థాంత రాత్మకః
> సోఙ్గాద్యభినయైర్యుక్తో నాట్యకం త్వభిధీయతే
> యస్మాత్స్వభావ స్సంహృత్య సాంగోపాంగగతిక్రమైః
> ప్రయుజ్యతే జ్ఞాయతేచ తస్మాద్వై నాటకంస్మృతం॥"

నాట్యమున కితివృత్తము శరీరమువంటిది. నానావస్థాంతరమైన లోకముయొక్క స్వభావ మంగాద్యభినయాదులచేఁ బ్రదర్శించుట నాట్యమనఁబడును. అట్టి స్వభావము చిత్రింపఁబడుటచే నాటకమని చెప్పఁబడుచున్నది.

నాట్య శబ్దార్థమునుగుఱించి భరతముని యభిప్రాయ మిట్లున్నది.

> " నానాభావోప సంపన్నం నానావస్థాంత రాత్మకం
> లోకవృత్తానుకరణం నాట్యమే తన్మయాకృతం
> యోయం స్వభావో లోకస్య సుఖ దుఃఖ సమన్వితః
> సోఙ్గాద్యభినయైర్యుక్తో నాట్యమిత్యభిధీయతే "

పెక్కు భావములతోఁ గూడి వివిధావస్థలతో నొప్పారు లోక వ్యాపారానుకరణమే నాట్యము. మఱియు సుఖదుఃఖములతో గూడెనేని నాట్యమని చెప్పఁబడును.

పైనున్న నాట్య నాటక శబ్ద నిర్వచనముల వలన నాటకము వివిధ లలిత కళాసారమని తెలియును.

అనుకరణమే సాధనముగాఁగల కళమూలమునఁ జిత్తైకాగ్రత సాధింపనగును. ఏకాగ్రత యనఁగా నవిదిత వేద్యాంతరముగా నేదేని యొక వస్తువునందుఁ జిత్తము నిల్పగలుగుట. బహుభేదములచే భిన్నమగు నీ ప్రపంచమందు నభేదానుభవము సంపాదించుట. ఏతదవస్థయే ఆనందమయము. ఈ యానందమును బొందుట కేదేని యొక కళయే చాలును.

> "త్రివర్గ ఫలదాః స్సర్వే దానయజ్ఞజ పాదయః
> ఏకం సంగీత విజ్ఞానం చతుర్వర్గ ఫలప్రదం॥"

ఒక్క సంగీతమే చతుర్వర్గ ఫలప్రదమైనపుడు సర్వకళా సమ్మేళనమైన నాటకమెంత "ఆనంద" ప్రదమో? ఒక్కొక కళ వేర్వేఱుగా నుండునపుడు దానియందుఁగొంత కొఱఁత యుండును. ఆ కొఱఁత వివిధ కళా సమ్మేళనమున పరస్పర సహాయమున దీరిపోవును. భావాశ్రయమగు నృత్యము (Mimic Art) తాళ లయాశ్రయమగు నృత్తము (Dance) గీతము సంభాషణలతోఁ గలిసి రసాశ్రయమగు నాట్యమై యవస్థానుకరణ పూర్తియగుసరికి నాటకమైనది. కనుక నాటకము వివిధ కళా సమ్మేళనము. అనగా కవిత్వము నృత్యము సంగీతము మున్నగు వేర్వేఱు కళావాహిను లొకచో సంగమించి నాటక కళా స్రవంతియై ప్రచలితోత్తుంగాభంగమై ప్రవహించి పరమానందాబ్ధి నంతరించును.

> "క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః
> దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం

(తరువాయి 8వ పేజీలో)

# వ్యథిత హృదయం

...ఈశ్వర...

నేను ఇప్పుడొక రిటైర్డు ఉద్యోగిని. ఆ దినాలలోని విరామములేని పనికి, ఈ దినాలలోని పనిలేని విరామానికి ఎక్కడి పోలిక! తీరికగా కుర్చీలో ఆరోజుల్లోచేసిన ఘనకార్యాలన్నిటిని నెమరువేసుకుంటూ కూర్చుంటాను. ఒక్కొక్కటి ఒక్కొక్కరకమైన ఉద్వేగాన్ని రేపుతూ వుంటాయి. కాని నా ఉద్యోగపు దినాలన్నీ ఒక ఎత్తు. ఎన్నోసంవత్సరాలైనా ఆ విషయము నిన్న మొన్న జరిగినది వలెనే ఉంటుంది. అది తలచుకొన్నప్పుడల్లా పిచ్చెత్తినట్లుంటుంది.

* * * * *

ఆనాడు అప్పుడే కోర్టు ప్రారంభమైంది. నేను నా అధికార స్థానములో కూర్చున్నాను. చప్రాసివచ్చి ఆపూట విచారణ కావలసిన కేసు కట్టలు ఒక్కొక్కటి మేజుమీదపెట్టాడు. కాలహరణం కాకుండా, వెంటనే మొదటికేసు తీశాను. చప్రాసీ వెంటనే కేకవేశాడు. "మిల్లుహర్తాళు ముద్దాయిలంతా లోపలికి రావాలి" అని.

ముందు ప్రాసిక్యూటరుగారు లేచారు. కార్మికులు ఏ విధంగా సమ్మెకు దారితీసింది, పోలీసువారు దానిని ఏ విధంగా ప్రజాక్షేమానికై ఎదుర్కొనింది, అంతా సవివరంగా ఉపన్యసించారు. నేను తదేకదీక్షతో అదంతా వ్రాసుకొంటున్నా.

ఇంతట్లో ప్రభుత్వపక్షపువాదం పూర్తయిపోయింది. ఇక "డిఫెన్సు" పక్షంకొరకు తలెత్తి చూశాను. "చెప్పుకోవలసినదేమైనా ఉందా" అని నేను కొంచెం అధికారస్వరంతోనే కేకవేశాను. "ఇటువంటి న్యాయస్థానాలలో వాదించడం అనవసరం" అని ఒక స్త్రీ కంఠం జవాబుచెప్పింది. నేను లోనువైపు పరకాయించి చూశాను. నేను ఇదివరకు సరిగా చూడనేలేదు. ఎక్కడో పరిచిత కంఠంలాగా ఉందే? ఎవరీవిడ???

* * * * *

అబ్బో! నిన్ననా ఇవ్వాళా? నేను క్రొత్తగా కాలేజీలో చేరిన దినాల సంగతి. ఏదో డిబేటులో, నాకు సరిగ్గా గుర్తులేదు. నేను ఏదో "ప్రపోజు" చేయడం, ఆవిడ దానిని ఖండించడం జరిగినట్లుంది. తరువాత మాకు పరిచయంకూడా ఏర్పడింది. ఆమె మాకు ఒకటి రెండు సంవత్సరాలు "జూనియరు" కూడాను.........

నేను తర్వాత డిగ్రీతీసికొని, విశాల ప్రపంచంలోకి బయటికి వచ్చాను. నా నిత్యదరిద్రం ఇంకా నా పీడనే ఆశ్రయించడంచేత వెంటనే ఉద్యోగంచేయడం తప్పనిసరి అయిం తాలూకా కచ్చేరీలో ఉద్యోగమున్నదని తెలిసి దరఖాస్తు ఇ వచ్చాను.

ఒకనాడు సాయంకాలం ఈవిడ మళ్ళీ కనిపించిం ఏదో మాట ధోరణిగా నేను ఉద్యోగంలో చేరుతున్నాన చెప్పాను. నేను ఈమాట చెప్పేసరికి, ఆవిడకి నిజంగా అం కోపం ఎందుకొచ్చిందో అర్థంకాలేదు. కాని ఆరోజు న్లవ ఆవిడ చీవాట్లుపెట్టడం తప్పకుండా చూసి తీరవలసినదే. దే లో కొంచెం పనిచేయ తగిన వాళ్ళంతా ఏ ఉద్యోగంతో, చేడతే దేశమేమవుతుందని సూటి ప్రశ్న వేసింది. వెం గుప్పెడు రూపాయలకొఱకు ఉద్యోగంచేసేవాడు కేవ "ఫూల్" అని అక్షరాలా అంది.

అవును. నావంటి దరిద్రుడి అవస్థ ఆవిడకేంతె స్తుంది. ఎందరి కాళ్ళో పట్టుకొంటేనేగాని ఈ చదువు పూ అయింది కాదు. ఆవిడకేం, మొదటి తారీఖుకల్లా మని ఆర్డ వస్తుంది ఇంటిదగ్గరనుంచి. అసలు అటువంటి అప్పుడు న ఆమెతో పోలిక ఏమిటి? నేను లోపల ఈ విధంగా స ధానం చెప్పుకున్నా.

ఇదంతా ఆనాడు గుర్తుకి వచ్చేటప్పటికి, నాకు తిరిగినట్లయింది. ఆరోజున ఆవిడ చీవాట్లు పెట్టుతున్న దృ నాకు కళ్ళకు కట్టినట్లుంది. ఏమిచేయడానికి తోచలేదు. చివ ధైర్యంచేసి, ముద్దాయిలను వదలిపెడ్దామని బుద్ధి కలిగిం కాని కేవలం వదలిపెట్టడం ఎట్లా? పోనీ ఆవిడేమన్నా స ధానం చెప్పితే నేను ఏదోవిధంగా కేసును కొట్టివేయవచ్చ నేను ఈ ఉద్దేశంతోనే, మళ్ళీ కొంచెం నెమ్మదిగా చెప్పా "తమరుకూడ వాదించడం మంచి"దని. న్యాయశాస్త్రవేత్త ఒకసారి చెపితే అర్థంకాదా ఏమిటి; అని దానికి సమాధా నాకు. ఇప్పటికి నిర్ధారణ అయింది. ఆవిడ నన్ను గు పట్టిందో లేదో అని నాకు సందేహం కలిగింది. ఆవిడ న తావాలి అని అవమానించినట్లుంది. నాలో మళ్ళీ అధి స్వరం బయటికి వచ్చింది. వెంటనే రెండుసంవత్సర కఠినశిక్ష విధించాను. నేను తీర్పు చెప్పగానే ఆవిడ ఒక నవ్వు నవ్వింది. అబ్బ! ఆనవ్వు నన్ను శూలపుపోటుల ఇప్పటికీ బాధపెడ్తూనే వుంది. ఆ నవ్వులో అటు విజ

(తరువాయి వ్రక్కపేజీలో)

# ★ భారతదేశ తటస్థ వైఖరి ★

—— పి. యల్. నరసింహారావు, ఎం. ఏ. (ప్రథమ) ——

భారతదేశము దాదాపు నూట ఏబది సంవత్సరములు ఆంగ్లేయుల పరిపాలనక్రింద నలిగి ఆగస్టు 15, 1947 నుండి స్వాతంత్ర్యమును పొందినది. ప్రభుత్వాధికారము ప్రజల హస్తగతమైనది. భారతదేశము స్వతంత్రమైనది మొదలు ఎన్నియో చిక్కు సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చినది. స్వతంత్ర భారతదేశము అంతర్జాతీయ రాజకీయ రంగములో ప్రముఖపాత్ర వహించవలసి యున్నది.

ఒక అర్ధ శతాబ్దిలో రెండు ప్రపంచ మహాసంగ్రామములు జరిగినవి. వాటిదుష్ఫలితములను అనుభవించిన ప్రజలు మరల యుద్ధము రాకుండ నివారించుటకై ప్రయత్నించుచున్నారు. కాని, కొందరు రాజకీయ నాయకులు తమ రాజకీయ ప్రాబల్యమును ప్రపంచము అంతటిపైనను స్థాపించుటకై, శాంతి యత్నములను భగ్నము చేయుచున్నారు. రెండవ ప్రపంచ యుద్ధమున రష్యా, అమెరికా, ఇంగ్లండులు కలసి నాజీ జర్మనీ, జపానులను ఎదుర్కొనినవి. కాని ప్రపంచ సంగ్రామము పూర్తికాగా, వారు ఆక్రమించిన భూభాగముల పంపకపు విషయములో విభేదములు కలిగి, చీలిపోయిరి. రష్యా ఒకవైపు, అమెరికా ఇంగ్లండులుమరియొకవైపు, మిగిలిన దేశములుకూడ చాలవరకు ఏదోవైపునకు చేరికొన్నవి. ఇట్టి పరిస్థితులలో ప్రపంచశాంతికై బయలుదేరిన సంయుక్త రాజ్య సమితి, తన విధిని నెరవేర్చలేకుండ ఉన్నది.

ఈ పరిస్థితులలో క్రొత్తగా స్వాతంత్ర్యముపొందిన భారతదేశము, ప్రతి అడుగు ముందువెనుకలను సరిగా గుర్తించి వేయవలసి యున్నది. ఏ ముఠాలోనో చేరక, భారతదేశము తటస్థముగ ఉండగలదని మనప్రధాని ప్రకటించినాడు. కాని చాలమంది నెహ్రూ విదేశాంగనీతిని తీవ్రముగవిమర్శించుచున్నారు. వీరి అభిప్రాయము, భారతదేశము తన తాటస్థ్యమును నిల్పుకొనజాలదని.

ఈ విమర్శనలను రెండు పంథాలుగావిడదీయవచ్చును. తాటస్థ్య సూత్రమునందే (Principle of neutrality) నమ్మకములేనివారు చేసినవికొన్ని. ప్రస్తుత పరిస్థితులు, తాటస్థ్యమును అనుమతించవనునవి మరికొన్ని.

భారతదేశ చరిత్రపుటలను త్రిప్పిన, ఎక్కడా, భారతదేశము మరియొకదేశముపై దండెత్తినట్లు కనబడదు. అట్లయినచో నెహ్రూ ప్రకటనపై అవిశ్వాసము తగదు. దేశచరిత్రయే మొదటి సందేహమునకు సమాధానము.

రెండవ సందేహము, అంతర్జాతీయ పరిస్థితులు భారతదేశ తాటస్థ్యమునకు అనుకూలముగలేవని. ఆ అంతర్జాతీయ పరిస్థితులను గమనింతము. భారతదేశము, "కామన్వెల్తులో" ఉండుటవలన, తన తటస్థవైఖరిని నిల్పుకొనజాలదని వీరి వాదము. ఇది పైకి సహేతుకముగా కన్పడినను, వాస్తవము కాదు. క్రిందటి యుద్ధములో, ఇంగ్లాండు రాజునకు విధేయతను ప్రకటించిన ఐర్లాండే తన తాటస్థ్యమును కాపాడుకొనగలిగినప్పుడు, రాచరికమును ఒక చిహ్నమాత్రముగనే (Symbol) గుర్తించిన భారతదేశము ఏల తన తాటస్థ్యమును నిల్పుకొనజాలదు?

విమర్శకులు బెల్జియమును ఉదహరింతురు. బెల్జియము రెండవ ప్రపంచ యుద్ధమున మొదట తటస్థవైఖరిని ప్రకటించి నిలుపుకొనలేకపోయినది. అట్లగతే మనదేశమునకు కూడ పట్టునని వారి నమ్మకము. కాని, ఈరెండు దేశముల భౌతిక నిర్మాణమును, ఒకసారి చూతము. తరతరాలనుండి శత్రువులైన జర్మనీ ఫ్రాంసులు దానికి ప్రాక్ పశ్చిమదిశలందున్నవి.

---

(ప్రక్క పేజీనుండి)

గర్వం, ఇటు నిర్లక్ష్యం గంగా యమునల్లాగ కలసి గోచరించినవి. ఆ నవ్వింవి పదేళ్ళనాటి విద్యార్థిని కాదు. ఒకత్యాగి. ఒక విప్లవకర్త!

అంతే. తర్వాత మళ్లా నేను ఎప్పుడూ ఆవిడను చూడనే లేదు. తర్వాత ఎప్పుడో పత్రికల్లో చూచాను. ఆవిడ ఎక్కడో సమ్మె చేయిస్తుండగా పోలీసు కాల్పులలో చని పోయిందట...........

---

(6వ పేజీ నుండి)

విశ్రాంతిజననం కాలే నాట్యమే తద్భవిష్యతి
బ్రహ్మస్త్రీణాంచ విజ్ఞేయం నాట్యం వృత్తాంత దర్శనం॥"

దుఃఖార్తులకు ధర్మోపదేశమున శ్రమార్తులకు వినోదమున శోకార్తుల కర్థోపదేశమున దపస్వులకు ప్రశాంతిచే వేయేల నందఱ కాయావిధముల విశ్రాంతిని గూర్చును. కనుకనే "భిన్నరుచేర్జనస్య బహుధాఽప్యేకం సమారాధనం" అను బహుమతిని బడసినది. ఏ కళయందైనను కొంచెమో గొప్పయో పరిచయమును నభిరుచియును గలిగినఁజాలును. దాని మూలమునఁ బండిత పామరులందఱికిఁ గూడ నానందము బొందగల్గు అవకాశము నీ దృశ్యకావ్యమగు నాటకము గల్గించును. కనుకనే "కావ్యేషు నాటకం రమ్యం" అను నార్యోక్తి సార్థకమైనది.

ఇందులో ఏ ఒక దేశమైనను రెండవ దేశముపై దండెత్తవలె నన్న తనసేనలు బెల్జియము గుండా పోవలయును. అట్లయిన ఆ సేనలపోకకు ఇది సమ్మతియో, అసమ్మతియో ప్రకటింప వలయును. భారతదేశము ప్రక్క అట్టి శత్రువులు లేరు; అంత చిన్న రాజ్యముకూడ కాదు. కనుక అది తన తాటస్థ్య మును నిల్పుకొనగలదు.

భారతదేశము అమెరికానుండి అప్పు తీసికొన్నది. కావున అది అమెరికను ముఠాలో జేరునని మూఢవవాదము. కాని, జరుగుతున్న చరిత్ర, వీరి అభిప్రాయమును త్రోసిపుచ్చు చున్నది. చైనాలో మొన్నటి విప్లవానంతరము, కమ్యూని స్టులు దానిపైన ఆధిపత్యమును వహించిరి. రష్యాకూడను దానిని గుర్తించినది. కాని అమెరికా మాత్రము గుర్తించనే లేదు. కమ్యూనిస్టు ప్రభుత్వమునకు చైనాలో పలుకుబడి యున్నదని తెలియగనే ఆ ప్రభుత్వమును భారతదేశము గుర్తించినది. అట్లు గుర్తించిన "కామన్వెల్తు" దేశములలో ఇండియానేమొదటిది. కొరియా సమస్యపై కూడ భారతదేశ నిర్ణయము సముచితముగా ఉన్నది. 38వ అక్షాంశను దాటవలెనని సంయుక్తరాజ్య సమితి ఆదేశించినది తప్పుమరియు, ప్రమాదకరమని, భారతదేశము తెలియజేసినది. దీనినిబట్టి అమెరికను విధానము సక్రమము కానప్పుడు భారతదేశము ఎట్లు వ్యతిరేకించుచున్నది తెలియనగును. అమెరికా డబ్బు తీసికొనినంతమాత్రమున, దాని చెప్పుచేతలలో భారతదేశము పడి యుండవలసివచ్చు ననెడి ఊహాగానము నిరాధారమైనది.

ఏదేశమైనను తటస్థముగా ఉండవలెనన్న, అట్టి వైఖ రిని అవలంబించుకొన్న దేశములలో కలసి తృతీయ పక్ష ముగా (Third Block) తయారు కావలెననియు, అట్టి దేశములు ఇప్పుడేవియు లేనందున, తాటస్థ్యము వీలులేదనియు కొందరందురు. ఇది కేవలము సత్యదూరము. రెండు మహా యుద్ధముల దుష్ఫలితములను అనుభవించిన కొన్ని దేశములు శాంతి సంరక్షణకై ప్రయత్నించుచున్నవి. ఇండోనీసియా, బర్మా, ఈజిప్టు, ఆఫ్ఘనిస్థాన్, పాకిస్థాన్ మొదలగు దేశములు యుద్ధనివారణకై కృషి చేయుచున్నవి. ఒకవేళ యుద్ధము తప్పనిసరి అగుచో, ఇవి తటస్థముగ నిలిచిపోగలవు. అవగా ఇట్టి మూడవ పక్షముగా ఏర్పడి, తమ తాటస్థ్యమును నిల్పు కొన గలవు.

ఏదేశపు తటస్థ వైఖరినీకూడ, రష్యా ఒప్పుకొన దనియు, అట్టి దేశములను తన శత్రువులుగ పరిగణించు ననియు కొందరి ఊహ. మనము ఈ విషయములోకూడ భయపడనక్కరలేదు. అటు ఆంగ్లో అమెరికనులకు, ఇటు రష్యనులకు, బలము సమానము. అందువలననే ఏ ఒక్కరు మరియొకరిపై యుద్ధమును ప్రకటించలేదు. ఒకవేళ రష్యా ఇండియాపై కలియబడినచో, ఇండియా ఊరుకొనదు గదా పెద్దదేశములలో ఒకటైన ఇండియాతో పోరాడుటలో, దాని శక్తిని కోల్పోవును. అప్పుడు, ఆంగ్లో అమెరికన్ పక్షము కన్న, దాని బలము తక్కువ కాగలదు. కనుక రష్యా అట్టి పనికి పూనుకొనదు.

ప్రపంచములో పెద్దదేశములు యుద్ధమునకు దిగినచో భారతదేశము ఎట్లూరుకొనగలదని కొందరి ప్రశ్న. దీని సమాధానము స్విట్జర్లండే. రెండవ ప్రపంచ యుద్ధములో ఆ దేశము ఎవరిలోను కూడ కలియలేదు. అట్టి చిన్న దేశము కూడ తన తాటస్థ్యమును కాపాడుకొన గల్గినప్పుడు, దానికన్న అన్నివిధముల కూడ పెద్దదైన భారతదేశము తాటస్థ్యమును ఎందుకు నిల్పుకొనలేదు?

పై విషయములను చూచిన భారతదేశము తటస్థముగా ఉండగలదని తోచుచున్నది. అంతేకాక, యుద్ధపు దుష్ఫలితములకు లోనగుటకన్న, తటస్థవైఖరే మంచిది. క్రొత్తగా స్వాతంత్ర్యమును సంపాదించిన భారతదేశమువంటి దేశమునకు, అభివృద్ధి గాంచవలయునన్న, తాటస్థ్య విధానమే శరణ్యము.



# ఆహారధాన్యముల ఉచిత సంరక్షణము

జి. కృష్ణనారాయణ (B. sc. Ag.)

ఆహార ధాన్యముల (Storage) సంరక్షణము నకు అద్భుతమైన జాతీయ ప్రాముఖ్యత గలదు. మన దేశములో ప్రతి వ్యక్తికిని సరిపోవునంత ఆహారధాన్యోత్పత్తి లేదు. దినదినాభివృద్ధి చెందుచున్న జనసంఖ్యకును. ఆహారోత్పత్తికిని ఎట్టి సాదృశ్యము గావించుట లేదు. ఆహార సరఫరా సక్రమముగ జరుగవలయునన్న ధాన్యముల దుర్వ్యయమును అరికట్టవలయును. కొట్లలో ఆహార దినుసులు తగ్గుటకు, కీటకములు. ఎలుకలు. మరియు తేమ (Moisture) ముఖ్య కారణములు.

## కీటకములు

సంగ్రహ సమయములందు కీటకములు అధికముగా ధాన్యమును నష్టపరచును. వీనిలో అండదశ (Egg stage): డింభదశ (Larral Stage): కోశస్థ దశ (Pupal Stage): పూర్ణదశ (Adult Stage) అను నాలుగు దశలు గలవు. డింభదశలో ఇవి సాధారణముగ గొంగడి పురుగువలె నుండును. కోశస్థదశలో నిశ్చలముగ నుండును. పూర్ణదశయందు ఇవి గ్రుడ్లుపెట్టి త్వరగా నశించును. కొన్ని జాతులు డింభదశలో, మరికొన్ని డింభ, పూర్ణ దశలయందు అమితముగా నష్టపరచును. అత్యుష్ణ, అతి శీతల ప్రదేశములందు ఇవి విశ్చేష్టగా నుండి సామాన్య శీతోష్ణ స్థితులందు యెక్కువగా కాన్పించును. కొన్ని జాతులలో ఒకే ఆడ కీటకము 400 నుండి 600 వరకు గ్రుడ్లుపెట్టగలదు. గ్రుడ్లనుండి పూర్ణదశకై 4 లేక 6 వారములు పట్టును. ఇవ్విధముగ ఒక జత 8 నెలలలో 80 లక్షల కీటకముల నుత్పన్నము జేయును. ఈ కీటకము లసంఖ్యాకములు. కొన్నిటిని గురించి దిగువ నుదహరింతము.

1. బియ్యపు పురుగు లేక లక్క పురుగు:- (Calandra Oryzae) ఇది పేనుకన్న పెద్దగానుండి నల్లని మెఱుపుదాల్చి యుండును. దీనికి ఒక ప్రధానమైన ముట్టె లేక ముక్కు వుండును. ఈ పురుగు పూర్ణదశలో నధికముగా నష్టపరుచును. ఇది గోధుమ, బియ్యము, జొన్న, మొక్కజొన్నలోని చెడ్డపీడ(Pest)

2. బరిణె పురుగు:- (Phizopertha Dominica) ఇది మొదటిదానికన్న చిన్నగానుండి తలక్రిందికి ముడుచుకొని యుండును. మొదటిదానివలెనే విశేషముగ ధాన్యముల నష్టపరుచును.

3 ఖప్రా:- (Trogoderma granaria) ఇది పై రెంటికన్నను చిన్నగానుండి కొంచెము వెడల్పుగా నుండును. దీని వర్ణము నలుపు గోధుమ మిశ్రితము. దీని పైభాగమున పొడవైన వెంట్రుకలుండును. దీని పూర్ణదశ హాని చేయదు గాని డింభదశ అమితముగా నష్టపరుచును. ఇది గోధుమను తొలచి లోపలి పదార్థమును తినివేయును.

4. ఎఱుపుపిండి పురుగు:- (Tribolium Castancum) ఇది బియ్యము, పిండి, మైద, పోజి, కంకి మున్నగు పిండి పదార్థములను నష్టపరచును.

5. ధాన్యపు దీపపుపురుగు:- (Grain moth)

6. బియ్యపు దీపపు పురుగు:- (Rice moth)

ఇవి రెండు చిన్న సీతాకోక చిలుకలవంటి గోధుమ వర్ణపు పురుగులు. ఇవి పూర్ణదశయందు నష్టపరచవు. శనగ, జొన్న, బియ్యమును డింభదశయందు నష్టపరచును.

7. పప్పు పురుగులు:- (Brunch chinunsis) నల్లని వర్ణము మరియు తెల్లని మచ్చలు గలిగియుండును. పప్పుధాన్యముల నమితముగా నష్టపరచును.

నష్టము (ఉపద్రవము) నకు మూలములు:-

i నష్టపడిన (Infested) ధాన్యపు కొట్లు:-

ii నష్టపడిన ధాన్యమును కొట్లలో పోయుట:-

iii చెడిపోయిన జనుప సంచులు:-

అపుదల:- i. కీటకరహితమగు ధాన్యమును ఉపద్రవమునుండి కాపాడుటకై ధాన్యపుకొట్లను శుభ్రపరచవలయును. గ్రామ కోతాలు, గోనెములు మున్నగునవి ఆవుపేడ, లేక నల్లమన్నుచే అలుకవలయును. ప్రభుత్వపు కొట్లలో, పెద్ద పెద్ద వర్తకపు కొట్లలోదీనికై ప్రత్యేక నియమములు పాటించవలయును. కర్షకులు ధాన్యము బాగుగ యెండిన పిదప గృహ

ములకు తెచ్చుట మంచిది. ప్రభుత్వపు కొట్లలో ధాన్యమును పంచులలో బోయుదురు. కావున సంచులపై D. D. T. మొదలగు రసాయనముల పొడి చల్లుట లాభదాయకము.

ii కొట్లలో ధాన్యము నష్టపడినచో (Ethylene, Dichloride, Carbontetra chloride) యొక్క పొగ వేయుట మంచిది.

ఎలుకల నివారణ

ధాన్యమును నష్టపరచు ఎలుకలు మూడు జాతులకు చెందినవి. 1. నల్లవి. 2. గోధుమవర్ణమువి. 3. ఇంటిఎలుకలు. ఎలుకల నివారణకై బోనులు, విషమాత్రలు, సైనోగ్యాస్ నుపయోగించుట మంచిది. విషమాత్రలు: Zinc phosphide, Arsinic, Barium Carbonite కలిపిన పిండితో జేయుదురు. వీనిని జాగ్రత్తతో నుపయోగించవలయును.

తేమ (Moist)

తేమ ధాన్యముల నెక్కువగా నష్టపరచును. ధాన్యము సరిగా యెండనిచో బూజుపట్టును. వానలు మరియు చలిగాడ్పులచే ధాన్యములు పచ్చలగును. కావున ఆరబోయుట యుచితము.

ధాన్యము పచ్చలుగానుంచు పద్ధతి మనదేశములో ప్రాచీనమునుండి యున్నది. ధాన్యనష్టము కుప్ప పైభాగ మునకే నిర్బంధపడును.

గమనిక:—ధాన్యపుకొట్లను, మరియు పరిసర ప్రాంతములను శుభ్రముగా నుంచవలయును. నేల సిమెంట్‌చేసి ధాన్యముపోయుటమంచిది. కొట్లగోడలు వాయువులోని తేమను గ్రహించును కావున సంచులను గోడలకు తగులునట్లుంచరాదు. ధాన్యమునకు చీడ యున్నచో వెంటనే శుభ్రపరిచి సంచులపై గమాక్సిన్ చల్లి సరఫరాకై పంపవలయును. ధాన్యము నింపబడిన సంచులు వరుసగా ఒకదానిపైనొకటి 15 కంటె యెక్కువ యెత్తుబెట్టరాదు. ఒక కొట్టులో ఒకేజాతి ధాన్యము బోయుట యుచితము. పై చెప్పబడిన విషయములను బాగుగ పాటించినచో ఆహార ధాన్యములకొఱత యుండదని దృఢముగా చెప్పవచ్చును.



# శిథిల జీవులు 

యం. వి. నాగభూషణరావు, బి. ఏ.,
బి. వి. యస్సీ. (ప్రథమ)

ఆమె అతడిని మనసార ప్రేమించడంలో దోషం లేదు. అతిశయోక్తికూడా లేదు. ఇరువురూ బాల్యస్నేహితులు. ధనవంతుల బిడ్డలే. కుల మత సాంప్రదాయాలుకలిసినవారె.... ఇరువురి హృదయాలు కళాసీమలే....ఆత్మలు ప్రేమ మధు పిపాసినులే. స్వేచ్ఛానుకూల వాతావరణాలలో జీవిత నావలను తేనెవాకలలో ద్రోల నిచ్చగలవారే....

దైవబలంవల్ల, పురోహితుల ఆశీర్వాదాలతో, ఇరు వంకల పెద్దల ఇష్టంపైనే జరిగిపోయిందా మాలతీ మధు మూర్తుల వివాహం....

కాలగతిలో రెండు వసంతాలు వారసుకొన్నట్టుగా గడి చాయ్....ఒకరోజు సాయంకాలం మధు మాలతులు మాలతీ పొదరో ఒదిగి ఆనంద తరంగాలలో తేలియాడుతున్నారు. "అటు చూడండి" అంటూ మధు ముఖం త్రిప్పి పడమటిగా అస్తమించే సూర్యుని అరుణకాంతులతో శోభాయమానంగా అలంకరింపబడ్డ ప్రకృతి సౌందర్యాన్ని చూపించింది. "చిత్ర కారుని కుంచలకు కూడా అందని ఆ అందమైన రంగులను చూడండి..." అంది. ఆనందంలో, గంతులిడే హృదయంతో అవునని సమాధానమిచ్చాడు మధు.

"మీరూ మీ నాయనగారమల్లే చిత్రకారులు కారేదేం?" అని ఆమె నోటివెంట వెలువడ్డమాట అతని ముఖమును వివర్ణం చేశాయ్. అర్థంగానట్టు అతనివంక చూచింది. ఆమెను వీడి తన గదిలోకి వెళ్ళాడు అతడు...

మానవజీవితాల్లో మరువరాని సంఘటనలనేకం; కాని వారి జీవితంలో నాటి సంఘటనే ఒకటి. అదే ముఖ్యం. నాటి సాయంసమయపు సంధెకాంతు లామె విషాద జీవితానికి నీరా జనం పట్టాయ్. నాడు పడిన చీకటి లోకానికి మన్నారు వెలు గుగా మారినా ఆమె జీవితంలో శాశ్వతంగా చీకటినిలిచింది.

హృదయావేదనలో, బరువుగా నిట్టూరుస్తూ అతణ్ణి సమీపించింది...లేని పుత్సాహంలో ప్రశ్నించింది..."ఊహ సుందరుల భంగిమారేఖనతో జీవితం సాగించ నిశ్చయించి నట్లుందే!" అంటూ నవ్వింది...కొంటెగాప్రశ్నించావని ఆమె హృదయం తృప్తిపరచిందామెను....

"ఉఁహ్" అని నిర్లక్ష్యంగా ఇచ్చిన జవాబామెను దెబ్బ గొట్టింది. ఇంతకు నేచేసిన తప్పు? నాటి సాయంకాలం ప్రకృతి దృశ్యాన్ని చూపడమె తప్పా? ఐనా దీనికింత కఠినశిక్ష? మన జీవితాల్ని యెందులకిలా వృథాచేస్తాడు? గడిచిన జీవితం జ్ఞప్తికి తెచ్చుకొంది. ఎప్పటికి ఆనందంగా, హాయిగా కాలం దొర్లిద్దామనే మాటల్ని జ్ఞప్తిపరుచుకొంది...." అంటూ ఉద్రే కంతో మాట్లాడే ఆమె కంఠం బొంగురుపోతూంది....అప్ర యత్నంగా కన్నీరు కారుతోంది....

"మాలతీ! అనవసరంగా విసిగించకు ఇందులో ఇరు వురి తప్పూ లేదు" అంటూ కఠినంగా పలికాడు మధు.

"తప్పులేని శిక్ష?" అంది ఆమె తిరిగి పేలవంగా....

"అవును" అన్నట్లు చూచాడు అతడు ఆమెవంక....

"ఎందుచేతని" తిరిగి ప్రశ్నించింది కర్కశ హృద యంతో.

"అజ్ఞానాంధకారంలో సంచరించే జీవికి జ్ఞానోపదేశం కలిగించావ్....ఏనాడో నీచక్కజేరి తండ్రిగారి కంఠ్యసమ యంలో చేసిన వాగ్దానం మరిచా. నీవు జ్ఞాపకంచేసి పితృబు ణము పూర్తిచేయమని అనుజ్ఞ ఇచ్చావ్ నాటి సాయంకాలం

ఇంతకూ పితృఋణముపూర్తిచేయడానికి మన ఆనందా నికి గల సంబంధం అంటూ ప్రశ్నించింది అప్రయత్నంగా.

మా తండ్రి మరణసమయంలో తను పూర్తిచేయ దలచికొనిన చిత్రాన్ని పూర్తిచెయ్యమని గొప్ప చిత్రకళాకారు నిగా ఖ్యాతి గడించుకొమ్మని కోరాడు. తప్పక మీ వాక్యాలను తు. చ. తప్పకుండా చరిస్తానని బాసగొన్నా. పూరింపమని ఆదేశించిన ఆయన చిత్రం పూర్తిచేసి, కళాకారునిగా మారే వరకు మన జీవితాలిట్లా నడవవలసిందే! అంటూ ఆమెవేపైనా చూడకుండా వెడలిపోయాడాచోటువీడి....

"ఆఁ...అంటూ నిలువున కూలిపోయింది..."

నిర్జీవప్రతిమల్లా జీవితాన్ని నిరాశామయంగా గడుపు తోంది...కళాసృష్టిలో నిమగ్నుడైన మధు పిచ్చివానిలా మారుతున్నాడు...ఎన్నోసార్లుప్రశ్నించింది...నాటిసాయంసమ యం నుండి నేటివరకు మూడు వసంతాలు వ్యర్థంగాగడిచాయని తెలియజేసింది. కాని ఆమె వేలత్వం అతని కళాహృదయంపై పనిచేయలేదు...

ప్రతిజ్ఞ నిర్వహణలో తన వ్యక్తిత్వాన్నే కోల్పోతున్నా డా మధు. అతని దీక్ష ఆమెకెంత అసంతృప్తిగా మారింది. తీరని కోరికల తెఱగా మారి, అంతుతెలియని భువన అరా మంలో ప్రయాణంచేసేది ప్రతిరోజా...జీవితాన్నేకోణంలో నుండి చూచిన చీకటిమయంగానే కనబడిందామెకు...ప్రపం చంలో ప్రతివస్తువు, ప్రకృతి, మానవుడు అంతాకూడి తన ఆనందాన్ని, సౌఖ్యాన్ని నాశనంచేస్తున్నారనే భావం ప్రబలి పోతుందామెలో రోజుకురోజూ, ఈ విశాల ప్రపంచంలో తన్ను

సుఖపెట్టగల జీవి లేనట్టుగా తట్టిందామెకు...ఏమిటీ ప్రపంచ పోకడ? నాకెందుకీ జీవితయాత్ర? అని ప్రశ్నించుకొని సమాధానం రాక బాధపడింది...తుదకు ఏవో భావం ఆమె హృదయాన్ని స్పందించింది. నిశ్చలత్వం; నిర్మలత్వం పొడచూపినై విషాదరేఖలమధ్య చిరునవ్వు తాండవమాడి చిటికలో మాయమయింది. ముఖమంతా విషాదరేఖలతో నిండింది.

అదృష్టవశాత్తు నాటి రాత్రంతా కృషిచేసిన ఫలితంగా తాను పూర్తిచేయదలచిన చిత్రం అత్యుత్తమ కళాఖండంగా మారి మధు హృదయాన్ని ఆనందతరంగడోలికలలో ఊగిసలాడించింది. తాననుకొన్నట్లు ప్రతిన నెరవేర్చుకొన్నాడు. కళాభంగిమతో ప్రజల హృదయాన్ని చూరకొని అత్యుత్తమ కళాకారునిగా మారిపోవచ్చు...ఇక నిరాశాభరితమైన మాలతి జీవితం ఆశాభరితమైన పూవులతో నిండిపోవచ్చు. ఎంతటి కర్కశత్వం నాలో అంకురించింది? అనే ఊహ చప్పున స్ఫురణకు వచ్చింది. మాలతిమాట జ్ఞప్తికి రాగానే ఆనందోద్రేకంతో ఆమెను సమీపించి క్షమాపణతోపాటు తన విజయాన్ని తెల్పుదామని "మాలతీ!" అంటూ దారితీశాడామె గదికి. చీకటితో నిండి నిశ్శబ్దంగా వున్న గది అడుగుల ధ్వనికి ప్రతిధ్వనించింది. దీపంసహాయంతో ప్రవేశించాడు గదిలోకి—తిరిగి "మాలతీ" అని పిలుస్తూ—కాని నిర్మానుష్యంగావున్న ఆగది సమాధానం ఇవ్వలేకపోవటం అతనిలో బాధను కలిగించింది. మాలతీ! మాలతీ! అంటూ ఇల్లంతా కలయచూచాడు...అమాయకంగా నిద్రబోయే దాసీలను లేపి "మాలతే"దని ప్రశ్నించి చూడమని తరిమాడు. ఉద్రేకంతో ఇల్లల్లా కలయదిరిగాడు "మాలతీ! అని. కాని మాలతిపేరే ప్రతిధ్వనించి సమాధానంగా నిలచింది.

ఉషాదేవి తన స్వర్ణకాంతులతో తూర్పుకొండలనలంకరించింది. సంతోషసూచకంగా తొలికోడి కూసింది. పక్షుల కలకలనాదాలతో దిక్కులు మారుమ్రోగినై. గాఢసుషుప్తిలో మునిగిన మానవజాతి నిద్రమేల్కొంటూంది. మాలతీ అంటూ, నిద్రపోని మధు వీధిలోనికి బయలుదేరాడు. సాయంకాలపు అరుణకాంతులు కూడా అస్తమించాయ్. చీకటి విజయగర్వంగా పట్టణాన్నావరించింది. "మాలతీ! మాలతీ!" అంటూ తన చీకటింట్లో ప్రవేశించాడు. శూన్యహృదయం "మాలతీ!" అంటుంది. అంతే! ఎందుకో? ఏమో? కాలచక్రం తిరుగుతూంది. కాలగర్భంలో అనేక సంగతులు కలిసిపోయినాయ్. మధు లోకందృష్టిలో పిచ్చివాడు. ఉన్మత్తుడు. శిధిలజీవి! అతణ్ణిచూచి పిల్లలు కేరింతలు కొడతారు. పెద్దలు పిచ్చివాడని తప్పుకుంటారు. కాని మాలతీ, అనే పలుకు తప్పితే అతని నోటివెంట మరోమాట రాదు. ఏ స్త్రీ కనికరించి అన్నంపెట్టినా "మాలతీ" అంటూ ఆమెవైపుచూచి వెఱ్ఱిగానవ్వి వెళ్ళిపోతాడు...కాలగర్భంలో కలసిన అతని జీవితగాథ ఎవరికి కావాలి? శిధిలజీవి మధు శిధిలరూపంలోనే క్షీణించి మృత్తికలో కలిశాడు. పాపం పిచ్చివాడు చచ్చిపోయాడు అంది లోకం! పవిత్ర ప్రేమికుని హృదయం అనాధ ప్రేతగా మారిపోయింది లోకందృష్టిలో.



# ఆంధ్ర మేఘ సందేశము

వెల్లయూరు వేంకటరాఘవశర్మగారు, ఎం. ఓ. యల్. (ఆంధ్రోపన్యాసకులు)

౧. చ॥ తనకొలువున్ బ్రమత్తతను—దప్పిన యక్షుఁ డొకండు, ఱేఁడు "కాం
తనెడసి యేఁడు కుందు" మని—తన్ శపియించినఁ, బెంపు గ్రుంగ, నా
జనకజ మున్గ మెలఁగు జ—లంబుల నిద్దపుఁ బొన్నచెట్లఁ బా
వనమగు రామశైలమున వాసమొనర్చెఁ దదాశ్రమంబులన్.

౨. మ॥ అలయద్రిన్ బ్రబలా వియుక్తిఁ దమిమై—యక్షుండు మంగేళ్లు హాం
గదముల్ జాఱుడు రిత్తగాఁ, గొని నెలల్—కాఁబుచ్చి, యాషాఢమం
దలి తొల్నాటను దాఁ గనెన్ బరిణతంబై వప్రఖేలాస్థతో
నలరన్ వచ్చిన దంతిపోల్కి—గొన బా—నాశ్లిష్ట సానున్ ఘనున్.

౩ మ॥ కలియం గన్నుల బాష్పముల్, కుతుకముం గల్పించు నామేఘమున్
గలఁ బెన్బ్రొద్దిటొ నిల్చి కుందెఁ గడు య—క్షస్వామి భృత్యుండు దా
జలదంబుంగనఁ జేత మొండు తెఱఁగౌ—సౌఖ్యాత్మలౌవారికే,
గళ సంశ్లేషిణి కోర్కులాడి యెడఁ గ—ల్గం జెప్ప నింకేటికిన్?

౪, ఉ॥ శ్రావణ మంత డాయ, సతి—ప్రాణములన్ నిలుపం దలంచి, యా
జీవనదాతచేఁ దనదు—సేమపు వార్తను నంపఁ జేయ, సం
భావనఁ గొండమల్లియలఁ—బువ్వుల పేరిమిఁ బ్రీతుఁ జేసి, స
ద్భావ మెలర్ప యక్షుఁడట—స్వాగతముం బలికెం బమోదుతోన్.

౫. చ॥ జల శుచి ధూమ వాయువుల—సంగతియౌ మొగులేడ? ఏడ ప్రా
ణులుఁ బటురేంద్రియాత్ములు జ—నుల్ నడపందగు వార్త? లంచుఁ జిం
తిల కల యక్షుఁ డుత్సుకత నీరదునిం బతిమాలె; నౌ; ఏమో
హాలయులు నైజదీనమతు—లౌదు రచేతన చేతనంబులన్.

౬. మ॥ అయ! నిన్నేఱిఁగితిన్, లోకవిదితంబౌ పుష్కలావర్త కా
న్వయ జాతున్, మఘవ ప్రధాన పురుషుంగాఁ గంటి: నట్లౌట, నే
నయ! యిష్టాలెడయౌట దైవగతి నిన్—బ్రార్థించెదన్; యాచ్ఞ వ
మ్మయినన్ మేల్ ఘనుపాల, హీనునియెడం బ్రాప్తించినం గాదటన్.

౭. చ॥ శరణమవైతి తప్తులకు—సారద! కాన ధనాధిపక్రుధా
భరమున దప్పులం బ్రియను—బాసిన నాదు ప్రవృత్తి మాపుము
వెడ; అలకాఖ్య జక్కులను—మేటుల ప్రోల్; వెలిఁ దోట నొప్పు నా
హరుతల వెన్నెలం జెలఁగు—హర్మ్యము లచ్చటఁ జూడ నింపగున్.

౮. చ॥ పరగి సమీర మార్గమున — వచ్చుట మాఱడి, గంపెఁ డాసతోఁ
గురు లెగఁద్రోసికొంచుఁ గనుఁ — గొంద్రు తమిన్ నినుఁ బాంథకామినుల్;
విరహిణి జాయ నేఁడఁట యు — పేక్ష యొనర్చెడి వ్యాపృతుండ వీ
వరుగఁగ, నస్వతంత్రుఁడగు — నన్యుఁడు నాయ మెపంపు గానిచోన్.

౯. చ॥ పరగుచు నొప్ప తిన్నగను — వాయువు ప్రేరణసేయు నిన్, మనో
జ్ఞ రుతము సల్పుఁ జాతకము — గంధయుతంబయి వామదిక్కునన్
బరిచితి గర్భధారణము నాఁ బెను పండుగ బార్లుదీరి యు
ప్పరమున నాశ్రయించుఁ గను — పండువ యౌ నిను నాఁడు బెగ్గురుల్.

౧౦. మ॥ దినముల్ లెక్కిడుకొంచుఁ దత్పరత మిత్తింజెంప; దయ్యేక ప
త్నిని ద్వద్భ్రాతృసతిన్ ఫలీకృతగతిన్ వే గాంచె; దౌ; నాశ నాఁ
జను బంధంబు సుమోపమంబు పెరిమన్ సంధిల్లుటన్ గాన వెం
టనె రాల్ నైజముగన్ని సంగనల ప్రాణాల్ నిల్పినన్ నిల్పెడిన్.

౧౧. చ॥ మొలవ శిలీంధ్రముల్, నెలయ — భూమి ఫలింపఁగఁ జేయఁజాలి, వీ
నులఁ దనిపించు నీయుఱుము — నాల్కలుపున్ విని, మానసోత్కముల్
జలజపుఁదూండ్ల లేఁదునియలన్ గొని బత్తెముగాఁగఁ ద్రోవ నీ
కల రజతాద్రిదాఁకఁగల హంసలగుంపులు మింటఁ దోడగున్.

౧౨. చ॥ నరవర వందనీయ రఘునాథ పదాంకిత మేఖలంబులన్
బరగు నుదగ్రుఁ బ్రేమ సఖుఁ — బర్వతు నక్కునఁజేర్చి చెప్పి పో;
పొరిఁ బ్రతి వర్షకాలమునఁ — బొందుచు నీతఁడు నీ వియోగమున్
చిర విరహోష్ణ బాష్పములు — నించుచుఁ దెల్లముసేయు నెయ్యమున్.

౧౩. ఉ॥ ఆరఁగ దస్సిదస్సి, గిరులందము గూనుముఁగుంది కుంది నో
రూరగఁ బెల్లులాఘవపు టోడికలందుఁ బయస్సుఁగ్రోలు, చేఁ
గోరఁగఁ జల్వ నీ నడకకుంచగు దారిపచింతు నిప్పు, డో
నీరద! వార్తలాల వినసేర్తువు శ్రోత్ర రసాయనంబుగన్.

౧౪. మ॥ "గిరిశృంగంబు హరించు నే మనిలుఁ డుత్క్షేపించి?" నాన్, సిద్ధ సుం
దరు లా ముగ్ధలు జళ్కి జళ్కి నినుఁగానన్ మోము లెత్తందమిన్
సరసశ్రీ నిచుళస్థలోత్పతనమున్ సాధింపుమా! తక్కి పీ
వర దిఙ్నాగ కరావలేపములఁ ద్రోవంద్రోద గాస్యుండవై.

౧౫. ఉ॥ మేలిమి రత్న దీధితుల — మిశ్రమొ నాన్ మఘవాస్త్రఖండ మీ
మ్రోలను నేత్రపర్వమయి — పుట్ట కొనన్ జనియించె దాన నీ
నీల శరీర ముజ్జ్వలము — నిగ్గులఁ దేఱెడు; వెల్గు పింఛమున్
దాలిచి గొల్లవేసమునఁ — దనర్చెడి వెన్నుని మేనునై వడిన్.

# లలితకళలు

మన పూర్వ గ్రంథముల ననుసరించి కళ లఱువది నాలుగు. కాని లోకవ్యవహారమందు కళ లసంఖ్యాకములు. వానిలో సర్వజనానందదాయకములగునవి మొత్త మయిదు మాత్రమే. 1. చిత్రలేఖనము 2. సంగీతము 3. నాట్యము 4. కవిత్వము 5. శిల్పము. వీనినే మన పూర్వులు లలితకళ లని, శృంగారకళలని మఱియు నెన్నోవిధములఁ బేర్కొనిరి. కవికుల గురువైన కాళిదాసు:—

"గృహిణీ సచివః సఖీమిథః ప్రియశిష్యా లలితే కళా విధౌ." యని రఘువంశములో; "లలితే సుకుమారే కలానాం గీతాదీనాం విధౌ అనుష్ఠానవిషయే ప్రియశిష్యా" యని మల్లినాథుడు బేర్కొనిరి. ఆనందము గలుఁగఁజేయునవే లలితకళలు

కొందఱు కళలను దృశ్య, శ్రవ్యములని రెండు విధములుగ విభాగించిరి. అందు చిత్రలేఖనము, శిల్పము దృశ్య కళలనియు, సంగీతము, కవిత్వము శ్రవ్యకళలని యనిరి. నాట్యకళ యీరెంటికి సంబంధించినదని వారి వాదము.

కళలలోని విశేషములు వానియందలి విషయమును చక్కఁగాఁ జూడగొన్నవారికే యనుభవమగును. మొదఁటివిశేషము, చక్కని ప్రతిమను జూచుటవలనగాని, రసవంతమైన కావ్యమును వినుటవలనగాని మనమంతరాత్మయందు నిర్వేటుకమైన యానంద మనుభవింతుము. లలితకళలలోని రెండవ విశేషము విశ్వజనీనత. ఒక కళా విషయము నెంత చూచిగొన్నను దానివలన నితరులకుఁ గలుగు నానందమున కేమాత్రము లోపమురాదు. మూడవ విశేష మా కళ లనుకరణములేగాని యనుకార్యములుఁగావు. (Imitatives but not originals) ఒకానొక సుందరి చిత్రపటము కళావిషయమగుచుండునుగాని ప్రత్యక్షమా సుందరివచ్చి నిలిచినది కళావిషయము కాజాలదు. రసవంతమై యుద్ధవర్ణనము కావ్యమగునే గాని కేవలమా యుద్ధ మెన్నటికిని గాజాలదు.

ఇట్లైయనుకరణమున రెంటిలో ప్రాధాన్య మీయబడినది. భావానుకరణ (Sentimental imitation) ప్రతి కళాకారున కవసరము. చిత్రకారుఁడుగాని, కవిగాని సృష్టియందలి వస్తువులను, మనోవికారములను ప్రత్యక్షముగ కన్నుల కగుపడుచున్నవా యేమి? యన్నట్లు వర్ణనలతో చిత్రింపవలెను. ఒకడు కజ్జరూపవర్ణములతోడను రచింపవలెను. చిత్రకారుడు తన కళానైపుణిచేఁ బటమును జూచువారికి కేవలముగ వ్యక్తియా యన్న భ్రమ కలుగునట్లు చిత్రించవలెను. కవి తన ప్రతిభావిశేషముచే వినువారికి తను వర్ణించునది కన్నులఁగట్టినట్లు వర్ణించవలెను. లోకానుకరణమునందు చిత్రకారునికంటె శిల్పిపనియే కష్టసాధ్యము. కాని కొన్ని వర్ణనలు చిత్రకారునికి సాధ్యములయ్యు శిల్పి కసాధ్యములవ వచ్చును. ప్రకృతి వర్ణనలు, ముఖ వికాసాది చమత్కారములను శిల్పికన్న నెక్కుడు నైపుణితో చిత్రకారుడు వర్ణించగలడు.

భావానుకరణమునందు కవి, శిల్పి, చిత్రకారులకంటె కష్టసాధ్యమైనపని నటునిదే. నటుడు లోకమందలి శారీరక వ్యాపారములను చక్కఁగ ననుకరించినగాని ప్రేక్షకుల మెప్పు వడయఁజాలడు. నటుడు నక్షత్రకునిపాత్ర నక్షత్రకుడై పోషించవలెనేగాని లోకవ్యవహారములో గాదు.

కళలలోని యింకొక విశేషమవి యనుకరణములన్న జ్ఞానము చూచువారికిగాని వినువారికిగాని యత్యంతావశ్యకము. దేవాలయాములలో దేవతావిగ్రహములంజూచి తన్మయులగువారు భక్తులుగలరు. స్త్రీవిగ్రహమునుఁజూచి కేవలము స్త్రీయే యని వాపోవు కాముకులు గలరు. కావున కళాకారులకును రసికులకును మనోనిగ్రహ మవసరము. కళ లనుకరణము లన్న జ్ఞానమును, మనోనిగ్రహమును కళాభిరుచి నాస్వాదించువారి కత్యంతావశ్యకము. కళాకారునియందున్న ప్రతిభా విశేషమేమనగా నత డనుకరణములను ననుకార్యములుగ నిరూపించును.

కళలన్నియు నౌచిత్యముతో గలసియే యుండును. కళౌచితి కళావిశేషములలో నొకటి. సంగీతము నాదౌచిత్యముతోడను, కావ్యము శబ్దౌచిత్యముతోడను గలిసియే యుండును. అమరావతీ స్తూపములలో, నాగార్జునకొండలలో, ఎలోరా అజంతాది గుహలలో, తాజమహలు నిర్మాణములో చిరస్థాయిమై యున్న మనవారి కళానైపుణి, ప్రతిభా విశేషములనన్యసామాన్యములు.

బి. కమలామనోహరరావు, బి. ఏ. (ద్వితీయ)

# లీల

ఎం. ఎస్. కుమారస్వామి, ఎం. ఎస్సి. (పరిశ్రమ)

### రంగము 1

స్థలం: కృష్ణారావుగృహం. సమయం: సాయంకాలం.

(కృష్ణారావు, అతనితల్లి కనకాంబ.)

కృష్ణారావు ఈజీచైరులో కూర్చొని, నవల చదువు తుంటాడు. అతని తల్లి అప్పటికి వస్తుంది.

కనకాంబ; కృష్ణా, నేటికి మూడురోజులుగా, ఆ సోమయాజులుగారు నీకై తిరిగి పోతున్నారు. అతడు వచ్చిన ప్పుడు నీవుండకపోవుటచేత...

కృష్ణారావు: (చదువునాపి) ఏం విశేషం?

కనకాంబ: విషయమా? (అంటూ బల్లడ్రాయర్ తెఱచి ఒక ఫోటోని తీసి) ఇదిగో, ఇది యిచ్చి వెళ్ళారు.

కృష్ణారావు: (తీసికొనిచూస్తూ) ఎవ్వరిది? ఎక్కడనో చూచినట్లున్నదే?

కనకాంబ: ఆఁ....చూచివుంటావులే. వారిక్కడివారే. తల్లిదండ్రులు ప్రస్తుతం యిచ్చటలేరు. ఊరికివెళ్ళారట...ఆస్థి అంతగా లేదనుకొంటా....యింటర్ చదివిందట...వీణ వచ్చు నట...

కృష్ణారావు: ఐతే, ఏమంటావమ్మా?

కనకాంబ: దీనిగురించే ఆ సోమయాజులువచ్చారు... కాని నీ సమ్మతంలేక నేను ఏం చెప్పలేనన్నాను అతనితో....

కృష్ణారావు: నాకిప్పుడు యిలాంటి వ్యవహారాలు తగుల పెట్టకమ్మా. ఇంకా రెండేండ్లుపోనీ. తర్వాతజూద్దాం.

కనకాంబ: ఏదో ఆ సోమయాజులుతెస్తే తీసికొన్నాను గాని, యింకేమీలేదు. నీకిష్టంలేదంటే సరే....

(అంటూ వెళ్ళిపోతుంది. కృష్ణారావు తిరిగి చదువ ప్రారంభిస్తాడు.)

---

### రంగము 2

స్థలం: కాలేజీ. సమయం: విశ్రాంతివేళ.

రామమూర్తి, కృష్ణారావు (M. A. విద్యార్థులు)

కృష్ణారావు రామమూర్తితో క్లాసునుంచి వస్తాడు.

కృష్ణారావు: ఒరే, రాము, నేను ఎలాగోవున్నావేంరా? క్లాసులోకూడ లెక్చర్ వినకుండా, గోడవైపుజూస్తూ కూర్చు న్నావ్. అజంతాచిత్రాలు అటువైపు గనబడ్డవా, ఏం?

రామమూర్తి: ఊఁ... ఏమీలేదు.

కృష్ణారావు: ఎమిట్రా ఆ నిట్టూర్పులు! ప్రసవవేదనలు పడుచున్నావే?

రామ: నీవింకా హైస్కూలు Manners వదల లేవోయి...నీకు చెప్పితే అర్థంకాదు. చెప్పకపోతే ఊరుకోవు.

కృష్ణా: సరే నీకిష్టంలేకపోతే చెప్పవద్దులే...పోనీ.... క్లాస్‌నోట్స్ కొంచం యివ్వు....నేను నిన్న సరిగ్గా వ్రాసుకో లేదు....ఆఁ....ఆదేమి....ఆ నీలిరంగు కవరు [రామమూర్తి జేబులోనుంచి ఒక కవరు తీస్తాడు

రామ: (దాన్ని తిరిగి తీసికొనడానికి ప్రయత్నిస్తూ) ఒరే, కృష్ణా, అది most personal చదవవద్దు.

కృష్ణా: (ఇంతలో దానిలోనుంచి ఒక జాబు తీసి చదువ ప్రారంభిస్తాడు) చి॥ రాముకు అనేక ఆశీర్వచనీయాలు. అందరూ క్షేమం. నీవు పరీక్షకొరకు బాగా చదువుచున్నా వని తలుస్తున్నాను. తర్వాత, నిన్నటిదినం ప్రక్కవీధిలోనున్న కుటుంబరావు నీకొక జాతకం తెచ్చాడు. చూపుకు బాగావుం దని మీతల్లి యన్నది. పిల్లమొక్క తాత retired sub-judge అట. మరి తండ్రి కలెక్టరుగా వున్నాడు. డబ్బు గలవారు. మీతల్లికి చాలా యిష్టం...పిల్లపేరు మీనాక్షి....

రామ: (జాబును లాగుకొనలాగి జేబులోవేసి) non-sense...యింక చాలు....వెళ్ళవస్తా...

కృష్ణా: (అతని భుజం పట్టుకొని) ఆగవోయి! పూర్తి గా చదువనేలేదు. నేను లక్షలతిని చాలారోజులైంది. పెండ్లిలక్ష్మ యిక...(అతని ముఖం చూచి) పోనీ....ఏం...ప్రైమాయిన్ వచ్చినవాడివలె నున్నావ్...రా టీ త్రాగుదాం...(వెళ్ళుచూ) ఏం, నీకిష్టంలేదా? మీ తండ్రిగారి proposal...

రామ: హూం....please close that sub-ject.

కృష్ణా: సరే...మొన్నటిదినం, మాయింట్లో ఏమైందంటే, ఎవ్వడో సోమయాజులుట, ఒక match నాకు తయారుచేశాడు. నేను Cheap Jack అనుకొన్నాదేమో కాబోలు. Go-between గా నుండి డబ్బులాగే ఉద్దేశం వలె వుంది. ఏం అంత extra-ordinary గా గనబడ లేదు. యింటర్ passed అట. వీణ వచ్చునట. కాని nothing in the bank! Nonsense!

రామ: తర్వాత?

కృష్ణా: తర్వాత, flat గా అమ్మరో నాకు వద్దని చెప్పివేశాను.

రామ: మీలాంటివారికి అన్నీ సాధ్యమే. మాలాంటి వారు అట్లంటే "వాడు పొగరుబోతు" అంటారు. Commoner అని నిరాకరిస్తారు. ప్రేమకు కులగోత్రములులేవని గ్రహించరు. నిజమైన ప్రేమకు ఆటంకములు అలక్ష్యం.

కృష్ణా: ఒరే. నా Shelly's "Love's philosophy" extracts చాలారోజులు నీదగ్గర వుండి పోయింది. నీతో నేను అక్రేంప్లున్నప్పటికి, నీవిలాంటి "కవి" అవి గుర్తింపలేకపోయాను. Love పై ఒక Thesis వ్రాయి. ఏ California University యో, నీకు తప్పక ఒక Ph. D. యిస్తుంది...సరిగా టైం అయింది. Roxy లో నేడు...A Woman's Vengenance. రా మ్యాట్నీకి పోదాం. (ఇద్దరు వెళ్ళుతారు)

---

## రంగము 3

స్థలం: నరసింహారావుగృహం. సమయం: 9 గంటలు

సోము...2nd form (మీనాక్షితమ్ముడు)

లక్ష్మి....1st form (మీనాక్షి చెల్లెలు)

లక్ష్మి, సోములు చదువ ప్రారంభిస్తారు.

లక్ష్మి: సోము! నాకు nature study లో (హోం వర్కు) పెట్టారురా! కొన్ని మృగాలపేర్లు చెప్పరా?

సోము: పో, పో, నేను జాగరఫీ చదువాలి.

లక్ష్మి: చూడు, నాన్నవస్తే, మొన్న నీవు నా పలక పగలకొట్టినదాన్ని చెప్పివేస్తే!

సోము: సరే చెప్పురావే. వ్రాసుకో. గాడిద, గుఱ్ఱం, ఏనుగు, గొఱ్ఱె, కోతి, మనిషి, లక్ష్మి.

లక్ష్మి: మృగమంటావ్రా నన్ను?

సోము: ఏదో తప్పిపోతే, పెద్దపులిలాగ అరుస్తావేం? సరే, నేను చదువుకొంటా "అమేజాన్ నది...

లక్ష్మి: పోనివే. కొన్ని కాయలపేర్లు చెప్పు.

సోము: అబ్బ! ఏం ఉపద్రవం! వ్రాసుకో! వంకాయ, బెండకాయ, గుమ్మడికాయ, సొరకాయ, టెంకాయ, మొట్టికాయ...

మీనాక్షి: ఎమ్రా టెంకాయ, మొట్టికాయలనుకూడా కూరకాయలు చేసావే!

సోము: వచ్చావా!...(పాడుతాడు) దూరదేశంవెళ్ళవే ఓ పెండ్లికూతురా?...నేను జాగరఫీ చదువాలి...కొంచెందయ జేసి నన్ను వదలి వెళ్ళవచ్చు. (చదువుతాడు) "అమేజాన్‌నది ఆఫ్రికాలో వుంది. అదిప్రవహించటంవలన, ఈజిప్టు అంతయు పంటలు"

మీనాక్షి: ఏమ్రా! అమేజాన్ నది ఆఫ్రికాలో వుందా! ఈజిప్టు అంతా పంటలా! అది నైల్‌నది కాదూ?

సోము: S. S. L. C. పరీక్షకు మూడుసార్లు వెళ్ళావుకాబట్టి నీకు అవన్నీ బాగా తెలుసును...మా టీచర్ యిలా నేర్పించాడు. నేను అలాగే చదువుతాను.

కుటుంబరావు: (ప్రవేశిస్తూ) ఏంరా ఆ గోల!

సోము: చూడండి. నన్ను వెక్కిరిస్తుంది.

కుటుంబ: వానితో నీకేమమ్మా అటలు!

(యింతలో నరసింహారావు ప్రవేశం)

నమస్కారమండి. వారందరు ఎల్లుండి వస్తారట, చెప్పటానికి వచ్చినాను. వెళ్ళివస్తా.

లక్ష్మి: (పాడుతుంది) రేపో, మాపో వస్తాడే!

సోము: సైలెన్స్, ప్లీస్.

---

## రంగము 4.

స్థలం: కృష్ణారావుగృహం-సమయం: ఒకసాయంకాలం.

రామమూర్తి, కనకాంబ.

రామమూర్తి తన class notes ను కృష్ణారావున కివ్వడానికి వస్తాడు.

కనకాంబ: రా, రాము. ఇటువైపు రావటంలేదే! చూచి చాలారోజులైందే?

రామమూర్తి: పరీక్షలు వస్తున్నాయి. చదువుకోవలసి యుంటుందండి...ఇదిగో ఈపుస్తకాలు కృష్ణారావుకివ్వవలె.

కనకాంబ: సరే. ఆబల్లడ్రాయరులోపెట్టి వెళ్ళు. వస్తే చెపుతా.

రామమూర్తి: (డ్రాయర్ తెరవగా, అందులో లీల ఫోటో వుండటాన్ని చూస్తాడు) ఈ ఫోటో యిక్కడ ఎలా వచ్చింది?

కనకాంబ: ఇంకా అక్కడనే వుందా? ఆ సోమయాజులు దెచ్చారు. మా కృష్ణునకు యిష్టమేమో అని తెలిసికోడానికి...(రామమూర్తి మొఖం తెల్లబోవుట గమనిస్తుంది) ఏం, అట్లుజూస్తున్నావ్.

రామ: ఏమీలేదండి. మన్నించుకోవాలి. నేను వెళ్ళి వస్తా. ఆ పుస్తగాలు మఱచిపోకుండా ఇయ్యండి.

(అంటూ త్వరగా వెళ్ళిపోతాడు)

---

రంగము 5

స్థలం: కృష్ణారావు గృహం సమయం: రాత్రివేళ

కనకాంబ, కృష్ణారావు.

కనకాంబ: కృష్ణా, సాయంకాలం రామమూర్తివచ్చాడు ఏదో పుస్తగాలిచ్చాడు. అదిగో ఆ బల్లపైవుంది.

కృష్ణారావు: Poor fellow! యిచ్చి వెళ్ళాడా! యింకేమైనా జెప్పాడా;

కనకాంబ: ఏమీ జెప్పరే. కాని.... డ్రాయర్‌లో ఆ ఫొటోచూచి, తెల్లపోయి, త్వరగా వెళ్ళిపోయాడు. ఎంచేతనో ఏమో!

కృష్ణా: ఫొటోచూచి తెల్లపోయాడా! సరే, కనుక్కొంటా. (యింటిలో ఒక కారుశబ్దం. తలుపుతీసి జూస్తాడు) అమ్మా! మామ వస్తున్నారు. (అంటూ) రండి, మామా, చాలారోజులైంది యిటువచ్చి... (వెనుకవచ్చు స్త్రీనిజూచి మాటలాపివేస్తాడు)

నారాయణరావు: ఏంరా! మాటలాపివేశావ్! ఎప్పుడు పరాయివాడుకాదులే! నా స్వీకార కుమార్తెనే, రామ్మా! రాధా ఇది. నా మేనల్లుడు కృష్ణారావు.

కృష్ణా: (మెల్లగా) నమస్కారం.

రాధ: నమస్కారం.

కనకాంబ: రండి. అందరు లోపలికి.

(అందరు వెళ్ళుతారు.)

కనకాంబ: (నారాయణరావునిజూచి) ఏం జెప్పక, చేయక వచ్చావు?

నారాయణరావు: ఏంలేదు, నన్ను పంపేసేవారు, అమెరికా వెళ్ళమని నిర్బంధపరచారు. రేపు సాయంకాలం విమానంలో వెళ్తాను. రావడానికి 4, 5 దు నెలలు పట్టును. రాధను మీతో వదలి వెళ్తామని పుద్దేశం.

కనకాంబ: మాకు ఏ అభ్యంతరం లేదు. తోడుగాకూడ వుంటుంది.

(ఇంతలో భోజనమునకు పిలుపువస్తుంది. అందరు వెళ్ళుతారు)

---

రంగము 6

స్థలం: రామమూర్తిగృహం సమయం: మధ్యాహ్నం

కృష్ణారావు, రామమూర్తి.

రామమూర్తి పడకపై కూర్చొని రవీంద్రుని Gardener ను చదువుతూ వుంటాడు. కృష్ణారావు వస్తాడు.

కృష్ణారావు: ఒరే, రామ్, నేడెందుకు కాలేజికిరాలేదు?

రామమూర్తి: ఏమో. I am not feeling well.

కృష్ణా: ఒళ్ళు బాగాలేదా? Doctor ను పిలిపించనా?

రామ: వద్దు. ఇది డాక్టర్‌లతో కుదరదు.

కృష్ణా: డాక్టర్‌తో కుదరదా? (ఆలోచిస్తాడు) ఆc... నేను మఱచాను నీవు నిన్న మాయింటికి వచ్చినపుడు, డ్రాయర్‌లో ఏదో ఫొటో చూచి తెల్లపోయి వెళ్ళిపోయావట. ఏం కారణం?

రామ: ......................

కృష్ణా: నీకిష్టం లేకపోతే జెప్పకు.

రామ: ......................

కృష్ణా: నిన్న మా మామ వచ్చాడు. అమెరికా వెళ్ళుతాడట

రామ: farewell జెప్ప వచ్చాడు కాబోలు.

కృష్ణా: దానికేకాదు, అతనికొక స్వీకార కుమార్తె ఉన్నది. మా యింట్లో వదలి వెళ్ళాడు. పేరు రాధ.

రామ: మీ ఇంటిపేరు "బృందావనం" కాదటోయ్! అంచేత రాధవచ్చింది కాబోలు?

కృష్ణా: నీవు మొన్న జెప్పినదంతా Absolute truth ఏదో వేదాంతంగా మాట్లాడుచున్నావని అనుకొన్నాను. కాని నిన్న ఆ మాటల్లోని సారము గ్రహించితిన్. (అంటూ ప్రక్కనున్న రవీంద్రుని Gardenerను తీస్తాడు తెఱచి చదువుతాడు.) Love unexpressed is sacred. It shines like gems in the gloom of the hidden heart. In the light of the Curious day, it looks pitifully dark.

రామ: రవీంద్రుని పల్కులు ఎంతయు నిజము.

కృష్ణా: రాము, I am taking this book

[ఇంతలో ఒక బండి యాగిన శబ్దం వినవస్తుంది]

కృష్ణా: [కిటికీనుంచి జూచి] రాము! మీ నాన్నగారు వచ్చారు. [రామస్వామిగారిని జూచి] నమస్కారమండి.

రామస్వామి: ఏడీ మావాడు?

కృష్ణా: ఇదిగో విచారంతో వున్నాడు.

రామస్వామి: ఏమీ విచారం? నేను వ్రాసిన జాబుకు బదులు ఉత్తరం వ్రాయనుకూడా లేదు. నేనేదో ప్రయాసపడి పెద్దకుటుంబపు సంబంధంజూస్తే విచారమేమిటి వీడికి? [రామమూర్తిని జూచి] ఊం.... తయారుకావాలి... నేడు రాత్రి మెయిల్‌లో పోదాం.

[కృష్ణారావు రామమూర్తికి సంజ్ఞజేసి వెళ్తాడు. వెళ్ళి 10 నిమిషాలు తర్వాత వస్తాడు. అతనిచేతులలో ఒక పసుపు రంగు Telegraphic Cover ఉంటుంది.

కృష్ణా: రాము! ఏదో Urgent టెలిగ్రాంవచ్చింది. విప్పి జూడనా [అంటూ తానే కవరును విప్పి అందునుంచి టెలిగ్రాం తీసాడు.] చి. రాముడి పెండ్లి ఆగిపోయింది. పిల్ల తాత మరణం. ఈసంగతి మీ తంత్రిగారి ప్రయాణం తర్వాత తెలిసింది. ఇట్లు....

రామస్వామి: అపస్రహనం.... అపస్రహనం.

కృష్ణా: హా! ఎంత అదృష్టహీనురాలు! ఏమండి. దైవ యత్నంకూడా అడ్డుగావుంది. అంచేత ఆవిషయం Cancel చేయండి. రండి మా యింటికి పోదాం.

రామస్వామి: ఇంక నాకేం కావాలి! వాని యిష్టం. ఎలాగైనా ఏడ్చిపొండి [అంటూ కోపంతో వెళ్ళిపోతాడు.]

రామమూర్తి: ఏమిట్రా, ఆ టెలిగ్రాం. నిజమైనదేనా

కృష్ణా: కృష్ణునిమాయ! Particulars అడగవద్దు. మీ నాన్నగారు నిజం తెలిసికొంటే తంతి తప్పిపోయి వచ్చిందంటాము... ఊం, లే. పోదాం.

## రంగము 7

స్థలం: కృష్ణారావుగృహం సమయం: సాయంకాలం

అందరూ

కనకాంబ విశ్రాంతికై సోఫాపై కూర్చొని యుంటుంది. సోమయాజులుగారు వస్తారు.

కనకాంబ: రండి. సోమయాజులుగారు!

సోమయాజులు: నమస్కారమమ్మా! ఏమైందివిషయం.

కనకాంబ: అదా! మావాడికి ఇష్టంలేదట...

సోమయాజి: ఇష్టంలేదా!... సరే యిష్టంలేకపోతే మనమేంజేస్తాం?

[ఇంతలో రామమూర్తితో కృష్ణారావు ప్రవేశం]

కృష్ణా: ఈతడేనా, ఆ సోమయాజులు?

సోమ: ఔనండి ..ఏమైన జెప్పతలచుకున్నారా?

కృష్ణా. చూడండి. మీ కృషికి ఫలితం లేకపోకూడదు. ఇదిగో మావాడు రామమూర్తి...

[ఇంతలో రాధ లీలతో ప్రవేశం.]

రాధ: [అందరితో] ఇదిగో నా old friend లీల

[రామమూర్తి ముఖం వికసిస్తుంది. కృష్ణారావుకు మాటలాగిపోతాయి. సోమయాజులు తెల్లపోతాడు. కనకాంబ సోఫానుంచి లేచి నిలువపడుతుంది]

కనకాంబ: రామ్మా లీలా. నీగురించేమాట్లాడుచున్నాం

[రాధ తెల్లపోతుంది]

సోమయాజులు: ఇంక నాకు సెలవండి. నాకింక ఏం పనిలేదు [అంటూ వెళ్ళిపోతాడు]

రాధ: లీలను మీకు తెలుసునట్టే వుందే?

కృష్ణా: ఔను. మేమందరం College Mates.

కనకాంబ: అందరు కూర్చోండి. టీ త్రాగి వెళ్ళవచ్చు

[అంటూ వెళ్ళిపోతుంది]

రాధ: నేనిప్పుడేవస్తా. లీలా. సోఫాలో కూర్చో

[అంటూ తన గదిలోకి వెళ్ళుతుంది]

[టెలిఫోన్ శబ్దం వినబడుతుంది]

కృష్ణారావు: ఎవ్వరో ఫోనులో పిలుస్తున్నారు!

[అంటూ తన గదిలోకి వెళ్తాడు]

[రామమూర్తి. లీలలు ఒకరినొకరు జూచుకొంటారు. ఆ చూపులలోని అర్థం వారికే తెలుసు]



# నేపాల్ కల్లోలం

( సమగ్రమైన వాస్తవిక పరిశీలన )

డి. వి. అప్పారావు, ఎల్. ఎల్. బి. (ద్వితీయ)

ప్రస్తుత నేపాల్, 17వ శతాబ్దాంతంలో రాజపుత్రస్థాన్ నుంచి వెళ్ళిన ఒక రాజపుత్ర శరణార్థిచే స్థాపించబడింది. దీని వైశాల్యం 54,000 చదరపు మైళ్ళు. జనాభా 55,89,000. నేపాల్ యింతకాలంనుంచి బయటి ప్రపంచంలో వీచే ఝంఝూమారుతాలకు లోనుగాకుండా, తన ప్రత్యేకమైన సాంప్రదాయాలనే అనుసరించుతూ వచ్చింది. ప్రపంచమంతటా రాజరిక పద్ధతి నశించిపోయినా కాని, యింకా యీ దేశములో రాజరిక వ్యవస్థ మిగిలియే యున్నది. రాజుపట్ల ప్రజలందరును అమితమైన గౌరవప్రపత్తులు, భక్తి విశ్వాసాలు కలిగి యున్నారు. వీరికి రామాయణము మతగ్రంథం. దీనిని పారాయణకు పూజకు ఉపయోగిస్తారు. యింత ప్రబలమైన మత విశ్వాసాలు వీరి హృదయములను ఆవరించికొనియుండుటవల్ల వీరిలో ఆధునిక రాజకీయ చైతన్యము ప్రవేశించలేదు. మధ్య యుగాల సంస్కృతి, సాంప్రదాయాలు యిక్కడ చాల బలీయంగా ఉన్నాయి. కనుకనే, ప్రస్తుత నేపాల్ కాంగ్రెస్ నాయకుడు కోయిరాలా తండ్రిని 30 సంవత్సరాలక్రితం ఒక పాఠశాల ప్రారంభించాడనే నేరానికి జైలులో పెట్టారు. దీనికితోడు వీరి దేశము కూడ సారవంతమైనది కాకపోబట్టి, అనేకమంది జీవనోపాధి అన్వేషణలో మాతృదేశమును వీడినారు. కొంతమంది సైన్యములో చేరినారు. యీ దేశస్థుల విశ్వాసమునకు మెచ్చి అనేకదేశములలో ధనవంతులు, వ్యాపారులు తమ ఆస్థి, ధనరక్షణకొరకు, వీరిని కాపలా వుంచుకుంటారు. యిటువంటి దేశములో ప్రస్తుతము కల్లోలము చెలరేగినది. యిందులోకూడ విచిత్రమేమంటే రాజు, ప్రజ ఒక పక్షమున వున్నారు. రెండవ పక్షమున ప్రధానమంత్రి ఉన్నాడు. యీ వ్యాసములో యీ అంతఃకలహముయొక్క పూర్వాపరాలను క్షుణ్ణముగా పరిశీలించుటకు ప్రయత్నింతము.

## రాజు, ప్రధానుల హోదాలు

రాజ్యాంగరీత్యానయితె సర్వాధికారాలు రాజుకే సంక్రమించి యున్నవి. సివిలు, సైనికాధికారులు రాజు సమక్షంలోనే, అధికార ప్రమాణ స్వీకరణ చేయాలి. విదేశరాయబారులు, తమ పదవీ నియామక పత్రాలను రాజుకే సమర్పించాలి. యింతేకాక రాజుకు ప్రధానమంత్రిని తొలగించే అధికారంకూడ వున్నది. దీనికి సాదృశ్యముగా యీ క్రింది విషయాన్ని ఉదహరించవచ్చు. నేటి నేపాల్‌రాజుతండ్రి తన ప్రధాని దేవ్ షంషేర్‌జంగ్ రాణాను తొలగించి, యిప్పటి ప్రధాని తండ్రి శ్రీ చంద్ర షంషేర్‌జంగ్ బహదూర్ రాణాను ప్రధానిగానియమించినాడు.

కాని 104 సం॥ల క్రిందట, అనగా 1846 సం॥లో నాటినేపాల్ ప్రధాని శ్రీ జంగ్ బహదూర్ రాణా, రక్తపాతం ద్వారా, పరిపాలనాధికారాన్ని యావత్తు హస్తగతం చేసుకున్నారు. అప్పటినుంచి నేటివరకు యీయనవంశీయులే నేపాల్ ప్రధాని పదవిని వంశపారంపర్యంగా అనుభవిస్తూ నిరంకుశాధికారాలను చెలాయిస్తూ వున్నారు. యీ 104 సం॥రాల నుంచి రాణాలు హిరణ్యాక్ష పరిపాలన సాగించుతూ వచ్చినారు. అనేకమంది యావజ్జీవ పర్యంతం కారాగార క్లేశాలకు బలిచేయబడినారు. అభివృద్ధి భావాలు కలవారు అనేక అవమానములకు వంచనలకు గురిచేయబడినారు. అనేకమంది మాతృదేశము నుంచి బహిష్కరించబడినారు. తమ ఆశయాలను సాధించుటకు, ధైర్యముగా రాణాలను ఎదిరించినవారు ఉరికంబము నెక్కించబడినారు. యీ దమననీతి బయటి ప్రపంచమునకు తెలియకుండా వుంచుటకు, విదేశస్థులను లోపలికి రానీయలేదు. ఎవరైనా కొద్దిమంది వెళ్ళితే, వారు ప్రభుత్వ అతిథులుగానే వెళ్ళినారు. యీరోజునకూడ అక్కడ ఏ ప్రభుత్వోద్యోగితోనైన మాట్లాడుటకుగాని, టెలిఫోను చేయుటకుగాని, ప్రధానమంత్రి అనుజ్ఞ అవసరం. సేనలపై సర్వాధికారం ప్రధాని చేతులోనే ఉండటంచేత, రాజు వాటిని చెలాయించజాలడు. దేశలలో వున్న యావత్తు వ్యవసాయభూమి, సైన్యములోని మరియు పరిపాలన శాఖలలోని అన్ని కీలకస్థానములు, 80 రాణాకుటుంబాలచేతులలో ఉన్నది.

## ప్రస్తుత రాజు

ప్రస్తుత రాజు త్రిభువన్ వీరవిక్రమ షా దేవ్ 1906 లో జన్మించినాడు. ఈయన 1911 సం॥ డిసెంబరు 11వ తేదీన

సింహాసనా రూఢు డైనాడు. యితను తన ప్రధాన మంత్రినిరంకుశత్వాన్ని ఎదుర్కొనుటలోను, ప్రజాహితాన్ని కోరే వర్గాలపట్ల సానుభూతి చూపుటలోను తనయొక్క వ్యక్తిత్వాన్ని యింతవరకు ప్రదర్శిస్తునే వచ్చాడు. దాదాపు 12 సం॥ల క్రితం, నేపాల్ ప్రజా పరిషత్తుచే, రాణాలకు వ్యతిరేకంగా తేబడిన ఉద్యమంను యితను సమర్ధించాడు. యీ సందర్భంలో యితనిమీద ఒక అభియోగం తేబడి విచారించబడినాడుకూడ.

ప్రస్తుత ఉద్యమపు పునాదులు : పూర్వకార్యక్రమము.

గత యుద్ధానంతరం, అనేక నేపాల్ రాజకీయపార్టీలు బెంగాల్, బీహారు, అస్సాంలో వున్న అమెరికన్ సైనికోద్యోగులనుంచి, ఆయుధాలు సేకరించి, నేపాల్‌లో ఆయుధ గిడ్డంగు లేర్పరిచినారు. ఇదియునుగాక, యుద్ధానంతరం సైన్యమునుంచి, విడుదలచేయబడిన అనేకమంది గూర్ఖాసైనికులుకూడ వీరితో చేతులు కలిపినారు. వీరు ప్రస్తుత ఉద్యమమునకు ఆయువుపట్టువంటివారు. ఇంకొకవిషయ మేమంటే నేపాల్ రాణాలలో 3 తరగతులున్నాయి. ఆఖరు వర్గానికి చెందిన రాణాలు 1929 లో తక్కిన రాణాలతో సమాన ప్రతిపత్తికోసం తిరుగుబాటు చేశారు. తిరుగుబాటు అణచివేయబడింది. 32 రాణాకుటుంబాలు దేశంనుండి వెడలగొట్టబడినాయి. వీరంతా భారతదేశంలో స్థావరం ఏర్పరచుకొని వర్తకము ద్వారా విశేషధనం సంపాదించినారు. యీ రోజున ఉద్యమంకొరకు వీరు ధన సహాయము చేయుచున్నారు. రాజుకూడ ఉద్యమంకొరకు కొంత ధనసహాయము చేసియున్నారు. పై వర్గాలన్ని కలిసి, నేపాల్ సైన్యములోని కొన్ని దళములను కూడ తమకు సుముఖులను చేసికొనుటలో కొంతవరకు కృతకృత్యు లైనారు.

ఈరీతిగా పునాదులు నిర్మించబడినవి, గత సెప్టెంబరు 16, 17 తేదీలలో నేపాల్, బీహార్ సరిహద్దులలో నున్న బార్గోనియాలో, నాయకులందరు సమావేశమై, దసరారోజున విప్లవారంభము చేయుటకు నిశ్చయించుకొన్నారు. ఈ ఉద్యమంలో నేపాల్ రాజు ఏరీతిగ సహాయపడవలయుననే ప్రశ్న ఉదయించినది. రెండు మార్గములు సూచించబడినవి. (1) రహస్యముగా ఖటమండు విడిచి ఎక్కడికైనా పారిపోవుట (2) లేనిచో ధైర్యముగా ప్రధానిని తొలగించి, సర్వసైన్యాధ్యక్ష పదవిని స్వయంగా స్వీకరించుట. దీనివల్ల పూర్తి సైన్యము రాజు అధికారము క్రిందికి రాకపోయినను, సైన్యములో ఒక విధమైన కలవరము, సంక్షోభము బయలుదేరగలదని భావించబడినది. కాని సెప్టెంబరు 24 తేదీ రాత్రి, ఒక గూఢచారి రాజుకు రహస్యముగా వర్తమానము చేరవేయుటకు రాజప్రాసాదము దగ్గరకు వచ్చి టార్చి వెలిగించినాడు. ప్రధానిచే నియమించబడిన కాపలాదళము ఇది చూచి అతనిని అరెస్టు చేసింది. తరువాత, ఇతను క్రూరంగా హింసించబడినాడు. సమస్త రహస్య సమాచారము సేకరించబడినది. మరుక్షణమే దేశము మొత్తము గాలించి, ఆయుధగిడ్డంగులు వశపర్చుకోబడినవి. అనేకమంది అరెస్టు గావించబడినారు, పర్యవసానంగా. నిర్ణయించబడ్డ విప్లవ ప్లానులన్నీ భగ్నమైపోయినవి.

తరువాత సంఘటనలు

ప్రధాని రాజప్రాసాదముచుట్టూ కాపలాను హెచ్చించినాడు. రాజుకు కూడా ప్రాణభయము కలిగినది. నవంబరు 6వ తేదీన యిండియా రాయబారికార్యాలయంలో తలదాచుకున్నాడు. మరునాడే అనగా నవంబరు 7 న నేపాల్ ప్రధాని షంషేర్ జంగ్ బహదూర్ రాణా పార్లమెంటును సమావేశపరచి, నేపాల్ రాజు రెండవ మనుమడు, యువరాజు ద్వితీయపుత్రుడు అయిన మూడు సంవత్సరముల పసికందు జ్ఞానేంద్రను నేపాల్ రాజుగా ప్రకటించినాడు. వెంటనే విప్లవనాయకులందరు మరల సమావేశమై 3 రోజుల వరకు నిర్విరామంగా చర్చలు కొనసాగించినారు. రాజు రహస్య పలాయనంవల్ల ఏర్పడిన ఆందోళనను, గందరగోళమును చక్కగా వినియోగించవలెనన్నారు. నవంబరు 10, 11 అర్ధరాత్రి ఉద్యమం లేవదీయుటకు నిర్ణయం తీసుకున్నారు. ఆరోజుననే రాజుకూడా తన కుటుంబముతోసహా ఢిల్లీ చేరుకున్నాడు. బీర్‌గంజ్‌లో పోటీ ప్రభుత్వం స్థాపించబడినది. విముక్త ప్రాంతాల పరిపాలనకు రాజుచే న్యాయశాస్త్రరీత్యా ఒక ప్రకటన చేయించి ఒక ప్రభుత్వ మేర్పరిస్తే ప్రస్తుత ప్రధానిని దేశద్రోహిగా పరిగణించి విచారించవచ్చు అనుకున్నారు. కాని అటువంటి ప్రకటన అయితే ఎందువల్లనో జరుగలేదు. రాజుదగ్గర డబ్బులేదని తెలవగానే అతనికి బీర్‌గంజ్ ఖజానా దోచి వశపర్చుకున్న ధనమునుంచి, 28 లక్షలు యివ్వ నిశ్చయించినారు. కాని కోయిరాలా ప్రత్యేక విమానంలో యీ ధనము తీసికొని, ఢిల్లీలో దిగగానే ఢిల్లీ పోలీసులు యీ దోపిడీ ధనాన్ని వశపర్చుకున్నారు.

ఇండియా పాలసీ, నేపాల్ భవిష్యత్తు

నేపాల్ ఇండియాలో ఒక భాగం కాకపోయినా అనేక విధాల ఇండియా నేపాల్‌తో సంబంధాలు కలిగి యున్నది. సాంస్కృతిక సంబంధాలకంటె గూడ రాజకీయ సంబంధాలు ముఖ్యము. యీ రెంటికి ఉన్న ఒడంబడిక ప్రకారం నేపాల్

కు సహాయము చేయవలసియున్నది. తన విదేశ వ్యవహారాల నిర్వహణలో, భారతప్రభుత్వ సలహా సహకారాలతో నడుచుకోవలసిన బాధ్యత నేపాల్‌కు కూడ వున్నది. కనుక నేపాల్ లోని రాజకీయ మార్పుల ప్రభావం ఇండియాపై ప్రసరించక మానదు. న్యాయశాస్త్రరీత్యా, నేపాల్ అంతరంగిక వ్యవహారాలలో, జోక్యము కలిగించుకొనుటకు, భారత ప్రభుత్వమునకు అధికారంలేదు. అందుకొరకే పార్లమెంటు సమావేశం ప్రారంభిస్తూ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ యీరీతిగా అన్నాడు. "నేపాల్‌దేశపు స్వాతంత్ర్యాన్ని భారతదేశం గౌరవిస్తుంది. మనం వారితో, స్నేహపూర్వకమైన సంబంధ బాంధవ్యాలను కోరుతూ, అక్కడి ప్రజలు ఆర్థిక, రాజకీయ రంగాలలో అభ్యుదయం పొందడం అభిలషిస్తాం.'' కాని యిది, న్యాయశాస్త్రరీత్యా లాంఛనంగా చేసిన ప్రకటనయేనని భావించవలసి యుంటుంది. ఆచరణలోకి వచ్చేవరకు అనేక చిక్కులు ఏర్పడుతున్నవి. నేపాల్‌లో జరిగే పరివర్తనలను, భారతప్రభుత్వం, చేతులుముడుచుకు, చూస్తూ ఊరుకుంటలేదు. అపుడే నేపాల్ ప్రధాని, ప్రజా ఉద్యమంతో సహకరించే రాజుకు వ్యతిరేకంగా, తన పరిపాలనను నిలబెట్టుకొనుటకు "క్రెమ్లిన్‌ఏజెంట్ల''తో కుట్రలు చేస్తున్నట్లు వదంతులు బయలుదేరినవి. ఇది నిజమైనచో నేపాల్‌తో మిత్రత్వ ఒడంబడికలు కలిగివున్న బ్రిటను, అమెరికాలు కూడ, ఏదోరీతిగా జోక్యం కలిగించుకొని, నేపాల్ ప్రభుత్వంలో తమ ప్రాబల్యం సంపాదించుటకు ప్రయత్నించగలవు. దీని దుష్ఫలితాలు భారతదేశముపై పడగలవు. కాని, యీ పరిణామాలు కలగకుండా చూడాలంటే, భారతప్రభుత్వము ఏమిచేయవలెను? మూడే మార్గములు ఉన్నవి. కాని ప్రతిమార్గములోను, విభిన్నమైన ప్రతిబంధకాలు అవరోధాలు వున్నవి. (1) ప్రత్యక్షముగా జోక్యము కలిగించుకొని సర్దుబాటు చేయుట. కాని యిలాచేయుటకు న్యాయశాస్త్రరీత్యా అధికారము లేదని పైన తెలిపియే ఉన్నాము. (2) రాజుకు, ప్రధానికి, నేపాల్ కాంగ్రెస్ మధ్య రాజీ కుదిర్చే ప్రయత్నము చేయుట. కాని యిన్ని సంవత్సరాలుగా నిరంకుశత్వానికి అలవాటుపడ్డ ప్రధాని, ప్రజాప్రతినిధులకు అధికారమిచ్చుటకు సమ్మతిస్తాడనేదిసందేహాస్పదం (3) పరోక్షముగానైనా, ఏదో ఒక పక్షమునకు సహాయముచేసి, దానిని అధికారంలోకి తీసుకవచ్చి, కల్లోలాన్ని అణచుట. యిక్కడ చిక్కేమిటంటే ఏ పక్షమును బలపర్చవలెను? ప్రధానిచేతులో 45,000 సైన్యము ఉన్నదని వాడుక. కాని సగానికిపైగా ఎప్పుడూ జైళ్ళలో మ్రగ్గుతారు. తక్కినవారిలోకూడ అసంతృప్తి ఎక్కువ. కనుక ప్రధాని నిలువబడ్డ పునాదులు గట్టిగాలేవు. అదియునుకాక, ప్రధాని నిరంకుశ పరిపాలనపట్ల ఇంత అసమ్మతి, అసంతృప్తి జనించినతరువాత, అతని ప్రభుత్వాన్నే నిలువచూడడం అవివేకమేగాక హానికరముకూడ. ఇక రెండవ పద్ధతి విప్లవకారులకు సహాయముచేయుట. కాని యీ విప్లవకారులందరు, ఒక ఆశయానికి కట్టుపడినవారుకారు. వీరిలో అనేక వర్గాలు కూటములు ఉన్నవి—జాతీయవాదులు కమ్యూనిస్టులు, రాచరికపు కుట్రలవల్ల పారిపోయివచ్చిన రాజవంశీయులు, కోటీశ్వరులు—ఏమీ తెలియని అమాయకప్రజ. సామాన్య ప్రజానీకం ఎందుకు వీరితో చేతులు కలిపారంటే యీ తిరుగుబాటు రాజుపేరిట లేచిందికాబట్టి. సామాన్యుల దృష్టిలో రాజు కేవలం విష్ణుమూర్తి. ఇన్ని విభిన్న వర్గాలు నేడు అవసరార్థం కలిసి పనిచేయుచున్నవి. నేపాల్ కాంగ్రెస్ అనగానే ఇండియా కాంగ్రెస్ వంటిదేనని భావించుట పొరపాటు. మన కాంగ్రెస్‌వలె, అది శాంతియుతంగా సేవచేసి ప్రజలనుంచి గౌరవవిశ్వాసాలను చూరకొనలేదు. అది రహస్యంగా, కమ్యూనిస్టుపార్టీలాంటి పద్ధతులలో పెరిగిన సంస్థ. ఈసంస్థ నాయకులపట్ల, ఎంతవరకు నేపాల్ ప్రజాసహకారమున్నదనికూడ ఊహించుట కష్టమే. ఒకవేళ, నేటి విప్లవకారులు, రాణా ప్రభుత్వమును అంతమొందించినప్పటికీ వీరందరు పరస్పర భేదాలు, చీలికలు లేకుండా, ఒక సుస్థిరమైన ప్రభుత్వమును నెలకొల్పగలుగుతారనే విషయముకూడ అనుమానాస్పదమే. ఇటువంటి క్లిష్టపరిస్థితిని, భారతప్రభుత్వ విదేశాంగశాఖ ఎలా పరిష్కరించునో చూడవలసి ఉన్నది.



# సైన్సు - మానవుడు

జి. శేషభూషణరావు, బి. యస్సీ. (ప్రథమ)

మానవునికి ఆదినుండియే స్వచ్ఛంద జీవనముపై ంతీ గలదు సంస్కృతిలేని అనాగరికజాతిగా నున్నప్పు డను మానవుడు ఎండ వానలనుండి సంరక్షింపబడుటకు ొండలను తొలిచియో లేక గుహలను వెదికియో, అందు వసించెడివాడు. నేడు ఆ కొండగుహలకు బదులు దివ్య ప్రాసాదములున్నవి. సునాయాసముగా అతివేగముగా అంత క్షములో ప్రయాణము చేయుటకు తగిన సాధనము లున్నవి. గాని మానవుని విజ్ఞాన సముపార్జన తృష్ణ తీరలేదు. మానవవా లో చైతన్యమున్నంతవరకు బుద్ధిబలమున్నంతవరకు ఈ ృష్ణ ఉండగలదు. విజ్ఞానసముపార్జనాతృష్ణ లేనినాడు మాన వుడు పశుతుల్యుడు కాగలడు. విజ్ఞానముయొక్క ప్రభావమిది.

సత్యాన్వేషణమే విజ్ఞానము. ప్రకృతిసిద్ధమైన సంఘటన లెన్నో మనము ప్రతిదినము చూచుచుందుము. సూర్యుడు ఉద యించి క్రమక్రమముగా పరిమాణమునతగ్గుచు కాంతిని హెచ్చు ను. విత్తుచెట్టుగామారి పుష్పించిఫలించును. వర్షసూచకములుగా ఉరుములు మెఱుపులు గోచరించును. అరుణముగా సూర్యో దయ మెందులకు కావలయునని పరిశీలించువారు అరుదు. చెట్టున పండిన పండు భూమిపై రాలును. ఈ సన్నివేశమును గమనించి పరిశోధనలు సలిపి దానికి గల కారణమును ప్రపం చమునకు వెల్లడిచేసిన మేధావి న్యూటను. సూదంటురాయి ఇనుము నాకర్షించును. పరిశోధకులు దీనిపై పరిశోధనలు సలిపి దాని ఆకర్షణాశక్తిని నిర్ణయించి సూత్రబద్ధమైన విజ్ఞాన మును వెదజల్లిరి.

విజ్ఞానమునకు ప్రయోగము ప్రమాణము. ప్రయోగా త్మక విజ్ఞానము విశ్వసనీయము. ప్రయోగముచే నిరూపింపలేని దానిని శాస్త్రవేత్త లంగీకరించరు. తరంగములు సముద్రతీర మునుండి సముద్ర మధ్యమునకు పోవునని చెప్పుట పరిహాసా స్పదము. ఏలనన ప్రయోగముద్వారా దీనిని నిరూపించలేరు. ప్రఖ్యాత భారత భౌతిక శాస్త్రవేత్త సర్ C. V. రామన్ అరుణోదయమునకు గల కారణమును ప్రథమముగా వెల్లడిం చెను. సూర్యునిది శ్వేతకాంతి. తెలుపురంగు రంగుల పెట్టె (spectrum) లోనిరంగుల సముదాయము. (Violet, Indigo, Blue, Green, Yellow, Orange and Red.) ఇంద్రధనస్సులో సాధారణముగా ఏడు రం గులు కనుపించును. ఒక్కొక్కప్పుడు కొన్ని వర్ణములు లోపించును. ఏదేని కారణముచేత ఒకరంగు అదృశ్యమైన దానికి బదులుగా వేరొక వర్ణముగల భాగము గాఢతమముగా కనిపించును. సూర్యుని శ్వేతకాంతి ఆకాశముయొక్క నీలి రంగుపై బడినప్పుడు శ్వేతకాంతిలోని నీలపుభాగము అంత రిక్షపు నీలకాంతితో మిశ్రితమగును. ఆకారణముచేత ఎఱుపు రంగు గల భాగము గాఢతమముగా కనిపించును. ఈకారణము చేతనే సూర్యోదయాస్తమయములు అరుణముగా నగును.

స్వచ్ఛంద జీవితాపేక్ష విజ్ఞానసముపార్జనావశ్యకతను కలిగించునుగదా! విజ్ఞానమును వెల్లడిచేయనియెడల అది వ్యక్తి గతాహ్లాద జనకమే యగును కాని మానవాళికి ఎట్టి ప్రయోజన కారియును కాజాలదు.

ఉదాహరణకు ఒక పరిశోధకుడు రసాయనిక ఎరువు లను కనుగొనును. దానిని వెల్లడిచేయకపోవుటవలన ఆజాతికి నష్టము కలుగును. వెల్లడిచేసినయెడల వాటిని ఉపయోగించి అధికాహారోత్పత్తి కలిగించవచ్చును.

వినోదము విజ్ఞానమునకు దారితీయును. జలపాతమును చూచి వినోదించి, కొంతకాలమైనపిదప పరిశోధనలు సలిపి విద్యుచ్ఛక్తిని కనుగొనిరి. లోకకల్యాణమునకై ఉపయోగింప బడు విజ్ఞానమె ఉత్తమము. మానవ సంహారకె విజ్ఞానము లేక శక్తి కనుగొనవలెను. విధ్వంసకచర్యలకు శక్తిని వినియో గించకూడదు. శక్తిని స్వలాభమునకుగాని లేక ఏ కొందరి శ్రేయస్సుకుగాని ఉపయోగించి పెక్కుమందిని నాశనము చేయుట మహాఘోరము. విజ్ఞానము ఒక ఆయుధమువంటిది. పదునుగల కత్తిని అజ్ఞానియైన పిల్లవానికిచ్చిన, అతడు తన తోటి బాలురలో నొకనిని గాయపరచును. ఒక వీరునికిచ్చిన క్రూరమృగములను సంహరించును. ఇదేవిధముగా శక్తిని వినియోగముచేయుట శక్తిపై అధికారమున్నవాని కోరిక లేక మనోవికాసముపై ఆధారపడియుండును. రేడియోద్వారా దూర ప్రదేశములలో ప్రసరింపబడుచున్న వార్తలను, వినగలుగు చున్నాము. ఈ రేడియోనె సాధనముగా ఉపయోగించి ప్రపంచసంగ్రామమువాంఛించు దుష్టశక్తులు పన్నుగడలుపన్ను చున్నారు. కావున శక్తియొక్క ఫలితము ఉపయోగించువాని పై ఆధారపడియుండును.

విజ్ఞానకేంద్రములపై ప్రభుత్వమెట్టి ఆంక్షలుపెట్టరాదు. విద్యాలయములపై ప్రభుత్వ యాజమాన్యముగాక విజ్ఞానవేత్తల

యాజమాన్యముండవలెను.

నేటి విజ్ఞానము మానవాభ్యుదయమునకు ఎంతవరకు తోడ్పడినదను ప్రశ్నపై సనాతనాధునికాభిప్రాయభేదమున్నది. సనాతనులు ప్రపంచము వినాశమార్గమునసాగుచున్నదందురు. ఆధునికులు ప్రపంచము శ్రేయోమార్గము నవలంభించినదందురు.

నేడు నానారాజ్య సమితివారు అణువుకంట్రోలు విషయమై ఒక నిర్ణయమునకు రాకపోవుట కడువిచారకరము. ప్రపంచ మూలమూలలనుండి జనులు యాటం కంట్రోలును గురించి విజ్ఞాపనలు పంపుచున్నారు. మానవుని భావియుగము గోచరముగా నున్నది. సామ్రాజ్య విస్తీర్ణతకై అగ్రరాజ్యము వారు అణుశక్తిని వినియోగించినచో శాంతి భద్రతలుచె మానవజాతి నాశమగుట తథ్యము.

---

పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్త్వమెరుగక శుకములగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్!

—గురజాడ



# హృదయావేదన

సి. నారాయణరెడ్డి, బి. ఏ. (ప్రథమ)

గీ॥ ఓ నవీన కిసలయాంగిరో! త్వదీయ
విశ్వమోహన లావణ్య విమలమూర్తి
నస్మదీయ మనోమందిరాంతరమున
నిలుపుకొంటి ప్రణయపూజ సలుపనెంచి.

గీ॥ పత్రివలెనాదు జీవిత భారమంత
నీదుమ్రోల నర్పించితినే లతాంగి!
జీవకళ సుంతయుఁ లేని శిలవటంచుఁ
దెలిసెనిప్పుడు నీరంగు తెఱలువీడ.

ఉ॥ హేనలినాంగి! నీవు లిఖియించిన అంతిమలేఖఁ జూచినా
మానస సీమలోపల తుపానులు, కంపము లెన్నొరేగె. గా
నీ, నినుగోరి నామదిని నిల్పినప్రేమ పవిత్ర బీజపు
జ్యాన, మదీయమానస మహాస్థలి బ్రద్దలుగాక తప్పెనే!

ఉ॥ ఓ చెలి! నీయొయ్యారముల నొప్పులగుప్పు విలాసహాసముల్
చూచి, త్వదీయ మానస ప్రసూనము ప్రేమ పరీమళాలనే
వీచిన దంచునెంచితిని, ప్రేమల తావులు లేనిహాసముల్,
పూచిన మోదుగుంబువుల పోలికయంచు నెఱుంగ నైతినే.

ఉ॥ నీ చిఱునవ్వు వెన్నెలలు నిండిన వెన్నెల మోముచందురుఁ
జూచినయంత, మామకమనోజలరాశిని మోదవీచికల్
వీచెనునాడు, నేఁడు ప్రభవించు వియోగపు పెందుపానులే
రేచియు ముంచివైచెను చలించమ నాప్రణయంపు టోడలఁ.

ఉ॥ నీ నయనాలు జిమ్ము కమనీయ విలోల విలోకనాల బం
దీనయిపోతి, నాహృదయ దీపిక కాంతులు పెర్గె వింత మో
దాన, పిశాచ కామిని విధాన వికావికనవ్వి నీవు నా
మానస దీపమార్పితివి మాఱని చీకటు లావరింపగఁ.

గీ॥ హృదయ సౌధంపు తలపులఁ గడియవేసి
ఏసుఏకాంతమున నిద్రబూననుంటి
కాని, యదియేమొ నీకంఠకలరవమ్ము
పిలిచినట్లగు మాటికి తలుపు దట్టి!

సీ॥ తెలిమేఘముల దూరు చలువ వెన్నెల తేని
వలపు చూపుల సిగ్గు మొలకలెత్త
కలువరేకులనెక్కి ఎలదేటి పూఁదేనె
కోనేట పల్లటీల్ గొట్టుచుండ
ఎడఁబాసి కూడిపోయిన ముద్దుల చకోరి
ప్రియుతో విరహ గాథవిన్నవింప
పూలబాలిక రెత్తిపోయు తాపులమోసి
గాడ్పుబిడ్డఁడు కాలు కదుపుచుండ

గీ॥ మురుపు గొల్పెడు నీ నీలికురులుజారి
కనుల నొక్కెడు సిగ్గును గప్పివేయఁ
జేసియున్నట్టి యారేయిబాసలన్ని.
మరచి పోయితే మోహినీ! మఱచిపోతె?

గీ॥ విరహ ఘోరానలమ్ముతో వేఁగుచున్న
అస్మదీయ సంతప్త దేహంపుసెగలఁ
కఱకు బండలు సైతము కరఁగునేమొ
కాని, కామినీ! నీగుండె కరఁగఁబోదు.

గీ॥ రాలిపోయె వికాసమ్ము రాకముందె
దరవికస్వర హృదయ సుందర సుమమ్ము
తేలిపోయెను వర్షమ్ము రాకముందె
జీవితాభ్రాన భావమేఘావళియును.



# సామ్యవాదము - ప్రజాస్వామ్యము

ఎం. రామమోహనరావు. ఎల్. ఎల్. బి. (ద్వితీయ)

అనాదినుండి సామ్యవాద ప్రజాస్వామ్య సిద్ధాంత మూలసూత్రములను ప్రతి ప్రభుత్వము ఆచరణలో పెట్టుచు వచ్చినది. అట్టి ప్రాచీన గ్రీకు సంస్థానములు, మధ్యయుగములో స్థాపింపబడిన చిన్నచిన్న ఇటలీ సంస్థానములు పెక్కులు గలవు. ఇంతటితో అన్ని ప్రభుత్వములు సామ్యవాదసూత్రములను ఆచరణలో పెట్టినవని నిక్కముగఁ జెప్పరాదు. నిజముగా ఆలోచించినచో ప్రపంచమందు నిరంకుశ ప్రభుత్వము లసంఖ్యాకములు.

18వ శతాబ్దములో యూరపు ఖండములో చెలరేగిన పారిశ్రామిక విప్లవము తదుపరి ఆర్థిక రంగములోనేగాదు తదితర రంగములందుఁగూడ గొప్పమార్పులు వచ్చినవి. ఫ్రెంచ్ ఆర్థిక శాస్త్రవేత్తలు, ఫిజియోక్రాట్లు ("Let go and Let pass") అను సూత్రము అన్ని రంగములలో వ్యాపించిపోయినది. తత్త్వవేత్తలపైగూడ దీని ప్రభావము చాటబడుట చోద్యముగదా! దీనినే "Laissez faire" అని యందురు. ఆడం స్మిత్ (Adam Smith) వంటి గొప్ప పాశ్చాత్య ఆర్థికశాస్త్రవేత్తలు దీనికి దోహదమొసఁగిరి. ఐనను కొలదికాలమునకే దీని దుష్ఫలితములు తేటతెల్లమైనవి. ఈ సిద్ధాంతమును ఆచరణలోపెట్టు ఇంగ్లీషు కార్మిక ప్రభుత్వము నేలఁ గూలినది. ఇదేవిధముగ యితర యూరపు సంస్థానములలోఁగూడ యిట్టి మార్పులే వచ్చినవి. ప్రజా శ్రేయస్సు కొఱకు నిర్దేశింపఁబడిన ప్రణాళికను ఆచరణలో పెట్టుటకు ప్రజలు విముఖత చూపినను ప్రభుత్వము నిర్బంధముగా అట్టి ప్రణాళికను ఆచరణలో పెట్టవచ్చును. ఉదా: ఇంగ్లండులో నిర్బంధ విద్యావిధానముకొఱకు ప్రభుత్వమునకు తీవ్రమైన వ్యతిరేకశక్తులనుయెదుర్కొనవలసి వచ్చినది. ఇట్టిసంఘటనలు పశ్చిమయూరపు ప్రజాస్వామ్యరాజ్యాంగ చరిత్రయందు అరుదుగా గన్పించును. కొన్ని అసాధారణ పరిస్థితులయందు తప్ప తదితర సమయములందు ప్రభుత్వము ప్రజాభిప్రాయముతో ఏకీభవించు వ్యక్తిస్వాతంత్ర్యము పాటింపఁబడును. అన్ని రంగములయందు అభివృద్ధికొఱకై అవకాశముఁగల్పింపఁబడును. భావప్రదర్శనపై యెట్టి నిర్బంధన యుండదు. ఇట్టి ప్రభుత్వములో ప్రజాభిప్రాయములను వ్యక్తపరచు వివిధసంస్థలు, శాసనసభలు, పత్రికల విమర్శకులు బహు జాగ్రత్తతో ప్రవర్తించుచుందురు.

దీనికి భిన్నముగా రష్యాలో కేంద్రీకృత ప్రజాస్వామ్యము స్థాపించినవాడు లెనిన్. ఇంగ్లాండు, రష్యా ప్రభుత్వములు రెండును ప్రజాస్వామ్యములే, ప్రజాప్రభుత్వములే; కాని రెంటియందును వ్యత్యాసము గలదు. రెండును వివిధ ప్రాతిపదికలపై స్థాపించబడినవి. బ్రిటిష్ ప్రభుత్వమునకు ఒక సమగ్రమైన చరిత్ర గలదు. కాలానుగుణముగ మార్పు జెందుచు ప్రస్తుత దశకు వచ్చినది. ఇకముందుగూడ యిది మార్పుఁ జెందుననుట నిర్వివాదాంశము. ప్రస్తుతము రష్యా దేశములో స్థాపింపబడిన ప్రభుత్వము నిజమైన ప్రజాస్వామికము గాదని నిరాఘాటముగ చెప్పవచ్చును. అన్ని ప్రాంతములును కేంద్ర అధిష్ఠానవర్గమైన ("పొలిట్ బ్యూరో")యొక్క ఆజ్ఞను శిరసావహించవలెను. ఆయా ప్రాంతములకు స్వతంత్రభావములను వ్యక్తపఱచు అధికారముండదు. వ్యక్తుల జీవితపు యితర సమస్యలతోపాటు ప్రపంచముయొక్క దృక్పథమును కూడ "పొలిట్ బ్యూరో" నిర్బంధపరచును. మార్క్సు ఊహించిన కార్మిక, కర్షక ప్రజాస్వామిక మిట్టిదేనా? అను సందేహము ప్రతివారికి కలుగవచ్చును. అతనికి పరిణామ హేతువాదములపై నమ్మకము ఎక్కువ. కాబట్టి తన సిద్ధాంతమునకు ప్రాతిపదికలు ఈ రెంటిపైననే వుంచినాడు. గట్టిగా ప్రబోధించినచో కార్మిక కర్షక ప్రజానీకము ప్రకృతిసిద్ధమైన శక్తి సామర్థ్యములు పొందునని మార్క్సు అభిప్రాయపడెను. అట్టి శక్తి కేవలము నిరంకుశ ప్రభుత్వమును కూలద్రోయుటకేగాక ప్రజాస్వామ్యమును స్థాపించి నిపుణతతో రాజ్యముసుఁ జలాయించుటకు మార్గదర్శియని అతని విశ్వాసము. లెనిన్‌కుమాత్రము ప్రజలలోని నిర్మాణాత్మక శక్తిపై యెట్టి నమ్మకమును లేదు. రష్యన్ విప్లవము ప్రజావిప్లవమని యెంత ప్రచారముఁ జేసినను నిశ్చయముగా కమ్యూనిస్టుల విప్లవమనే ధృవపడినది. కావున ప్రతిపక్షులను నిర్మూలము గావించుటకు నాటినుండి నేటివఱకు ప్రయత్నములు జరుగుచున్నవి. ప్రజలు సామ్యవాదమును సంపూర్ణముగ అర్థము చేసికొని ప్రభుత్వము స్థాపించినచో నిరంకుశత్వము నిలువఁజాలదు. పశ్చిమదేశాలలో కార్మిక కర్షకులు ఆర్థికముగానేమి సాంఘికముగానేమి పెట్టుబడిదారుల గుప్పిటిలో కీలుబొమ్మలుగా వర్తింపరను మార్క్సు వాక్యములతో మనము ఏకీభవించవచ్చును.

వర్గములుగా విభజింపఁబడిన, సమాజములోనె, యిట్టి అపాయమున్నదట. కావున వర్గరాహిత్య సమాజము ప్రతి స్వామ్యవాది ఆహ్వానించును. అయినను ప్రజాస్వామ్యమునకు ఆయువుపట్టగు వ్యతిరేక పక్షమువలన యెట్టి యభ్యంతరము లుగదు. పశ్చిమ యూరపు ప్ర జా స్వా మి క ము న కు కేంద్రీకృతమైన రష్యన్ నిరంకుశ ప్రజాస్వామికమునకు గల వ్యత్యాసము యిద్దిదే. జిహ్వకొక రుచి పుర్రెకొక బుద్ధికదా! ఒక్కటే రుచికి భిన్నముగా జరుగు ప్రతిచర్య ప్రకృతి విరుద్ధము. అది చిరస్థాయిగా మనజాలదు. అట్లుగానిచో మానవుని మానవత్వము త్వరలోనేనశించును. మానవుడు భౌతికరంగములలో గొప్పవిజయము సాధించవచ్చును. కాని నైతిక, సాంస్కృతిక రంగములలో నిట్టి పురోభివృద్ధికి మార్గము గన్పడదు. ఈ రెంటికిని మధ్య నొక పెద్ద అఖాత మేర్పడుచున్నది (Cultural bay) ఈ రెండింటిని సమన్వయపఱచు వఱకు ప్రపంచములో సుస్థిర శాంతిని ఆశించుట కేవలము వెఱ్ఱియూహాయేకదా:




సి. నారాయణరెడ్డి,
బి. ఏ. (ప్రథమ)

ఏమోయి తుమ్మెదా!
ఏ వైపు పయనమ్ము?
మునిగిపోయినదేమి?
మాన్పు వేగమ్ము.

గొంతు కిన్నెరతో, ఎ
సంత దివ్యానంత
సంతోష గీతికల్
సాగ గానిమ్ము.

ఝుమ్ము ఝుమ్మను నీదు
కమ్మ నౌ కంఠ గా
నమ్ముతో చివురించ
నిమ్మ వనమ్ము.

మధుర మంజుల మనో
హరమైన నీ గాన
మహిమలో సర్వమ్ము
మరచిపోనిమ్ము.

నీ గాన వాహినీ
నిండు నువ్వులు బోసి
పూల బాలల నెల్ల
పుష్పించనిమ్ము.

సగము విచ్చిన మేలి
పగడాల మొగ్గలకు
గిలిగింతలను జలిపి
వలపు లెగ జిమ్ము.

వలపు లూరిన సుమ
మ్ముల మోవులను దాకి
పలు తీయ తేనియల్
బా జ గా ని మ్ము.

తే నె బిం దు లం జే రి
పా న మ్ము లే గా క
తా న మ్ము ల ను జే సి
రా ణిం చ బొ మ్ము.



# నా బిడ్డ

★ బి. శ్రీధర్ రావు, బి. ఏ. (ద్వితీయ) ★

అది పల్లెటూరు. ఊరిప్రక్కనే నదివుంది. ఊరి వారందరు త్రాగేనీరు అక్కడినుండే తెచ్చుకుంటారు. ఊరికి వెలుపలిభాగంలో ఒక చిన్న గుడిసె వుంది. పార్వతి వుండేది ఆ ఇంట్లోనే. తల్లి నెలదివసముల క్రితం చనిపోయింది. తండ్రి ఎవరో ఆమెకే తెలియదు. మొత్తానికి చాల బీదకుటుంబము. ఎంత బీదకుటుంబములో జన్మించినో అంత అమోఘమైన తెలివి, రూపాలామె కల్గినవి....

సూర్యాస్తమయ సమయమైంది. పక్షులు జంతువులు తమ తమ ఇండ్లదారి బట్టినవి. పార్వతి బిందె తీసుకొని నది యొడ్డుకు బయలుదేరింది. ఆమె ఒడ్డుకు చేరుకునేవరకా ప్రదేశము నిర్మానుష్యమైనది. చిన్న చెట్ల పొదవద్దకి చేరి నలు ప్రక్కలు తీక్షణంగా పరికించి, బట్టలు విప్పి, పిండి ఆరవేసు కుంది. కట్టుబట్టలుతప్ప వేరే లేనేలేవామెకు. నదిలోనికి దిగి స్నానముచేయు సమయానికి ఆమె బావ, రాము అదే, దారిని ఇంటికిపోతూ ఆమెను చూచాడు. పొదలచాటునదాగి, చిన్నగా పారూ! అన్నాడు. ఆమె నిలువునా నీరైపోయి తన శరీరాన్ని తను దొంగిలించినట్టుగా ఒకసారి తన రెండు హస్తాలతో తన వక్షాల్ని దాస్తు కూలబడింది. అసలు రామూ అంటేనే ఆమె కసహ్యం. ఛా....పో....సిగ్గులేదూ! అని చీవాట్లు పెట్టింది. వాడు తనదారి చక్కాపోయాడు. బట్టలువేసుకొని నీళ్ళబిందెతో ఇంటికొచ్చేసింది. ఎట్లో పార్వతి దినాలు వెళ్ళ బోస్తున్నది. అందరు ఆమె దీనావస్థకు అయ్యో! అనే వారె. పొద్దస్తమానముకూలికివెళ్ళేది. ఇంటికివస్తెమంపలించే దిక్కు లేదు. తింటె తింటుంది లేక దుఃఖిస్తు పడుకొంటుంది.

వేసవికాలపు శలవుల్లో చంద్రశేఖర్ ఇంటికి వచ్చాడు. Inter పరీక్ష యిచ్చి మూడేళ్ళతదుపరి వచ్చాడతడు. పట్న వాసాని కలవడిన యితని జీవితం ఈపల్లెటూరిలో నిర్జీవం గాగా గడచిపోతున్నది. సాయంసమయాల్లో నదియొడ్డుకెళ్ళి కొంతకాలం గడిపేవాడు. ఒకనాడు నదికి వెళ్ళాడు. ఒక ఇసుకతిన్నెపై బోర్లపడుకొని గడువక్రింద రెండుచేయిలిడి నీళ్ళలో మెసలాడే చిన్నచిన్న చేపల్ని చూస్తున్నాడు. ఇట్లు ఎంతకాలం గడిపాడో అతనికే తెలియదు. నీళ్ళలో చంద్ర బింబం స్ఫుటంగ కానవస్తుంది. ఆ చల్లటి గాలి ముఖానికి తగులుతుంటె ఆ అలల్లోనే తన్మయత్వం పొందుతున్నాడతను. తన వెనకవైపుగా నున్న పొదలో ఎవరో నడచినట్లు శబ్దము వినవచ్చినది. అతను లేచి కూర్చున్నాడు. కూనిరాగాలు విన వస్తున్నాయి. "దానధర్మాల వెల్గుగా పల్లెసీమ, మా పల్లెసీమ." స్త్రీస్వరమని గుర్తించాడు. విని విని హూ....అని చల్లగ నిట్టూర్చాడు. ఇంతలో పార్వతి నెత్తిన బిందెపెట్టుకొని ఇవతల అడుగు పెట్టింది. ఈ శబ్దము విని ఉలిక్కిపడ్డది. బిందె కింద పడ్డది. వెనక్కు తిరిగేవరకు తను కనపడ్డాడు. అందరియెడ అన్ని సమయాల్లో ధైర్యంగ ప్రవర్తించె పార్వతికీసారి సిగ్గు వచ్చింది. దానిచె తల నేలకువంచుకుని నిలుచున్నది. ఏంపిల్లా భయపడ్డావా? అంటూ దగ్గరికి వచ్చాడు. ఆమె కదలకుండా అలానే నిలబడింది. పిచ్చిపిల్లా నిట్టూర్పుకే భయపడుతావా? అంటూ ఆమె వీపుమీద చిన్నగా చరిచాడు. ఆశరీరస్పర్శతో అతను ఎంతో సౌఖ్యానందము ననుభవించాడు. ఆమె మాట్లాడలేకపోయింది. అప్రయత్నంగా ఆమె కన్నులనుండి రెండశ్రుబిందువులు జారి శేఖరు కాళ్ళమీద పడ్డవి. అతనామె తలను రెండుచేతులతో పైకి నెత్తాడు. చంద్రకాంతిలో అశ్రుపూరితమైన నేత్రములను జూచి అతని హృదయం కరిగి పోయినది. ఎందుకు పారూ! అన్నాడతను. ఆమె గుండె మరింత బరువెక్కినది. ఎంతో ప్రయత్నంమీద "ఇంతవరకు ఈ శరీరాన్ని నే నెవరిని తాకనివ్వలేదు" అంటూనే ఆమె శబ్దము మందగించింది. పార్వతి శీలము, స్థితి అతని కిదివరకే గుర్తు.పారూఅంటూ ఆమెను తనహృదయాని కత్తుకున్నాడు.

కొంతసేపు తన హృదయముపైనే వుండిపోయింది. ఆరాత్రి శేఖరు పారూతో ప్రతిజ్ఞచేశాడు. "ఈజన్మలో నీతోనే వివాహమాడుతాను. సాక్షులేకీ అంటూ పారూ నవ్వుతూఅంది. ఆమె హస్తాన్ని హృదయంపై నుంచి ముమ్మారు ఇవే శబ్దాలు మళ్ళీమళ్ళీ అన్నాడు.

ఇట్లు వారి ప్రేమ దినదినాభివృద్ధిగా పెరుగుతూవచ్చింది. ప్రతి సాయంత్రం వారు నదియొడ్డున కలుసుకొంటుండేవారు. ఇప్పుడు పార్వతిలో ఒక పెద్ద మార్పేర్పడ్డది. మొదటిజీవితానికి ఇప్పటి జీవితానికి చాలా తేడా. చిన్నగ నవనాగరికలా తయారైంది. శేఖరు స్నేహంద్వారా తన ప్రపంచజ్ఞానాన్ని చాలా వృద్ధిపొందించింది. ఇట్లు మూడుమాసాలు త్వరగ, సౌఖ్యంగా, సంతోషంగా గడచినవి.

శేఖరు పరీక్ష ఫలితాలు తెలిసినవి. మొదటితరగతిలో ప్యాసు. అనాడామె సంతోషానికి మేరలేదు. శేఖరు నగరం వెళ్ళుతాడని తెలిసి చాల దుఃఖపడ్డది. రేపు శేఖరు వెళ్ళుతాడు. అనాడు రాత్రి వారు కలుసుకున్నారు. ఆమె చాలా దుఃఖించింది. శేఖర్ పరిపరివిధాల వాగ్దానాలు చేశాడు. లెక్కలేని

గగనపుష్పాలన్ని జూపించాడు. శేఖరు వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు పాతికరూపాయిల మనీపర్సు యిచ్చాడు.

శేఖరు వెళ్ళిన పదిమాసాలకు రెండు మూడు ఉత్తరాలుమాత్రంవ్రాశాడు. పార్వతికి ఇప్పుడు ఎనిమిదవమాసము. యీసంగతి శేఖరుకు తెలిసింది. ఊరివారందరికి తెలిసింది. అందరూ అనేకవిధాల నిందించారు. శేఖర్ తల్లిదండ్రులకు తెలిసింది. శేఖరునింటికి రానివ్వలేదు. ఈసారి శలవుల్లో శేఖరు రాలేదు. పార్వతి ఈ నిందలకన్న చనిపోవుట మేలను కున్నది. కాని శేఖరుకొరకు ఆమె బ్రతికి వున్నది. అతను తన వాగ్దానాన్ని పూర్తిచేస్తాడన్ని గట్టి నమ్మకం.

ఒక శుభముహూర్తాన పార్వతికి పుత్రసంతానం కలిగింది. పుత్రునిజూచి తన దుఃఖాన్నంతా మాపుకునేది. ఇట్లు మూడు వత్సరాలు గడిచినవి. శేఖరు రాలేదు. పూర్వజన్మ కర్మయని తన్ను తా నోదార్చుకునేది...

పార్వతి జీవితం మళ్ళీ మొదటిమాదిరి మారింది. ఆమె శీలాన్నిగురించి చెవరి కనుమానము లేదు. అందరు బుద్ధి గడ్డి తిని చెడుత్రోవ త్రొక్కిందనేవారేకాని మన సమాజము ఇల్లాంటివారినిమన్నిస్తుందా? నాల్గోవత్సరాంతమున (M.A.) పరీక్ష తరువాత శేఖరు ఇంటికొచ్చాడు. పార్వతి తన మొఖము చూపదలచుకోలేదు. అతడు కృతఘ్నుడు. అతను పార్వతిని బహుశ మరచిపోతా వుంటాడు. ఒకనాడు సాయంత్రం నది వొడ్డువైపు వెళ్ళాడు. పిల్లలంతా చమత్కారమైన ఆటలాడు తుంటె చూస్తున్నాడు. ఒక పిల్లవాణ్ణి తదేకధ్యానంతో చూస్తు న్నాడు. పోలికబట్టి చూస్తె తనమాదిరే వున్నాడు. అతనికగో చరమైన వాత్సల్యం కలిగింది. పిల్లవాణ్ణి పిలిచి ఎవరబ్బాయివి నీవు? అని అడిగాడు. "మా అమ్మ అబ్బాయి నన్నా" దతను. అతని జవాబుకి చాలా మెచ్చుకున్నాడు. పదిరూపాయిలనోటు తీసి అబ్బాయికిచ్చాడు. అది అందుకొని చక్కాగా ఇంటికి పరుగెత్తి తల్లికిచ్చాడు. ఇవతలికొచ్చి ఆమె శేఖర్ను గుర్తించింది. అతనిచ్చిన మనీపర్సు పిల్లవానికిచ్చి ఆయనకిమ్మని పంపింది. పిల్లవాడు అవి తెచ్చి యిచ్చాడు. శేఖరు పర్సును తెరిచాడు. తన ఫొటో. లోపలచూస్తె పాతిక రూకలు. అతనికంత బోధపడ్డది. కళ్ళు చీకట్లు కమ్మినవి. వెనుకటిచరిత్ర జ్ఞాపకము వచ్చి నిలువలేకపోయాడు. పారూ మన్నించదనిఅతనికిగుర్తు.

వెనక్కు తిరిగి ఇంటికి వెళ్ళి తన గదిలో పడకపై పడిపోయినాడు. చాలాసేపు దుఃఖించినాడు. అతని శరీరము వేడెక్కిపోతుంది. అతని మతి చెడిపోతుంది. తల్లివొచ్చి భోజనానికి లేపింది. అతను మాట్లాడలేదు. కదిపి లేపింది. అబ్బ! ఎంతవేడి. జ్వరంవచ్చింది నాన్న. తండ్రివొచ్చి చూచాడు. అతను స్పృహలేకుండా పడివున్నాడు. తల్లిదండ్రులు చాలా భయపడ్డారు. ప్రక్కగ్రామం మిషన్ దవాఖాననుండి డాక్టరును పిలిపించారు. డాక్టరువచ్చి పరీక్షచేసి "రోగం ఏమి లేదండి" అన్నాడు. పారూ... పారూ...! అంటూ వేడి నిట్టూర్పు విడిచాడు శేఖరు. "ఏం నాన్న" అని తండ్రి అతని ముఖము పైకి వంగాడు.

పారూ ఎవరండి. వారిని తీసుకరండి. అబ్బాయి సుఖపడుతాడు. ఇది అతి పరితాపంవల్ల కల్గింది. వేరే ఏమి లేదు. వారిని త్వరగ పిలిపించండి. లేకుంటె ప్రమాదం. ...

తుదిమాటలతో తండ్రి గుండెలో రాయిపడ్డట్టయింది. పారూ! అన్న శబ్దాలలో అంత గోచరమైంది. వేరే గత్యంతరము లేదు. చక్కాగా పారు ఇంటికి వెళ్ళాడు. ఆమెను వేడుకున్నాడు. సంగతంతా చెప్పాడు.

పారు పరుగెత్తుకుంటూ, పుత్రుని తోలుకొనివచ్చింది. వచ్చి శేఖరు పాదాలకు నమస్కారంచేసి శేఖర్! నేను వచ్చాను అంటి అతని ముఖముమీదికి వంగి.

వచ్చావా పారూ! నన్ను మన్నించు. ఇక నాకు బాగౌతుంది. ప్రక్కన నిలుచున్న అబ్బాయినిచూచి చేతులుచాచాడు. దగ్గరికి రమ్మన్నట్టు.

అబ్బాయి దగ్గరి కొచ్చాడు. తన హృదయముమీద పడుకోబెట్టుకుని "నా బిడ్డ" మా నాన్న యని ముద్దులవర్షం కురిపించాడు...



# వరూధిని - సత్యభామ

కోవూరు గోపాలకృష్ణారావుగారు, ఎం.ఏ. (ఆంధ్రోపన్యాసకులు)

శ్రీకృష్ణదేవరాయల యుగము ఆంధ్రులకు చిరస్మరణీయము. లక్ష్మీ సరస్వతులాయన సభామందిరమున నృత్యములు సలిపినారు. ఆంధ్రవాణి అతని ఆస్థానము నలంకరించిన సత్కవీశ్వరులకు మధుర రుచుల చూపినది. ప్రబంధ సాహిత్యము నాటి కవితా మార్గమునకు జ్యోతియై విరాజిల్లినది. ఆ జ్యోతిని నవీనకాంతులు వెదజల్లునట్లుగా ఒనర్చు భాగ్యము గౌరవము పెద్దన తిమ్మనార్యులకు దక్కినది. ఆంధ్ర కవితా పితామహుని అమృతవాక్కు, తిమ్మనార్యుని తీయని పలుకులోని రస మాధుర్యమును అలవరచుకొనిన వరూథిని సత్యభామలు ప్రబంధ స్త్రీలలో అత్యుత్తమస్థానము నలంకరించి యున్నారు.

సామాన్యముగ ప్రబంధ స్త్రీలు ఒకే అచ్చులోని బొమ్మలని పండితుల నిశిత విమర్శకు పాలైనారు. కాని వరూథిని సత్యభామ లనినంతనే రసికులు, సహృదయులు తల లూపి అనిర్వచనీయమైన ఆనందము పొందుచున్నారు. వరూథిని సత్యభామలందుగల సజీవత్వము, ప్రత్యేక విశిష్టతయే ఇందులకు కారణము.

వరూథిని సత్యభామలు ఒకే యంత్రపుబొమ్మలుకారు. పెద్దన తిమ్మనార్యులు, వస్తు రస పాత్రపోషణములో అవలంబించిన భిన్న మార్గములు, వరూథినీ సత్యభామలందు గర్భీకృతములైనవి. ఆ సత్కవీశ్వరుల విభిన్న దృక్పథమును, వరూథిని సత్యల ప్రత్యేకత్వమును సూక్ష్మముగా విచారింతము,

కావ్యవస్తువును పోషించుటలో పెద్దన తిమ్మనార్యులు వేరువేరు మార్గమును అనుసరించినారు. మనుచరిత్ర పారిజాతాపహరణము ప్రథమాశ్వాసములో ఈ భేదము స్పష్టపడుచున్నది. ప్రబంధము దృశ్య శ్రవ్య లక్షణ సమన్వితమైన నాటకమునకు, కావ్యరూపానుకరణమనియు గ్రహించి కావ్యారంభము నాటక పద్ధతిని చేయుట తిమ్మనార్యుడు పూనుకొని సఫలీకృత అవర్చుడైనాడు. కావుననే పారిజాతాపహరణము కొద్ది మార్పులతో నాటకము కావచ్చునని పండితులభిప్రాయపడినారు. నాయికా నాయకులను ప్రత్యక్షముగా వర్ణించి ప్రవేశపెట్టక తిమ్మనార్యుడు మెలకువతో ప్రవర్తించి శ్రీకృష్ణుడు, సత్యభామ, నారదుల ప్రవేశమును, వారి చిత్తవృత్తులను, మనోద్దేశములను, కథాశిల్పమునందే మరుగుపరచినాడు. శ్రీకృష్ణుని ప్రేమను, సత్యభామ అనురాగమును, రుక్మిణీదేవి సౌందర్యమును తిమ్మనార్యుడు ప్రత్యక్షముగా వర్ణించలేదు. రుక్మిణీ సత్యభామల అనురాగము, చిత్తవృత్తిని సంభాషణా క్రమమున ఎట్లు మరుగుపరచినాడో చూడుడు:

కులమును రూపముఁ మగని
కూరిమియుం గలదాన నంచు నీ
వల నల రుక్మిణీరమణి వాసి జెలంగగ,
సత్యభామయుం
కులమును రూపముఁ మగని
కూరిమియుం గల దాస నంచు నా
వల పచరింపగా రవరపప్రోద మె
న్మది వారికెంతయుఁ.

ఇందునిభాస్య! మైతొడవులేల
ధరింపవు సన్నగావు లీ
వెందును మానలేవు దెలు పేటికి
గిట్టితి వీటికా రుచు
లెక్కొందలిరాకు మోవి దిల
కింపగ జేయక యున్కి యేమి నీ
చందము వింత యయ్యెడు వి
జంబుగ నా కెరుగంగ జెప్పుమా.

పెద్దనార్యుని మనుచరిత్ర ప్రారంభము నాటక పద్ధతిని లేదు. వప్రస్థలీ చుంబితాంబరమైన అరుణాస్పద పట్టణము, అచట నివసించు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు, మకరాంక శశాంకమూర్తియైన ప్రవరాఖ్యుని దినకృత్యములు, సిద్ధుని ఆగమనము మొదలైనవి కథారూపమున వర్ణితము

తైనవి.

వరూధిని ప్రత్యక్ష వర్ణనతో కథారంగమున ప్రవేశించును. ప్రవరాఖ్యుడు ఆమెనుచూచు సందర్భమున పెద్దన ప్రబంధమార్గమును అనుసరించినాడు.

అతఁడావాత పరంపరా పరి
మళ వ్యాపారలీలఁ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కని
యెఁ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీక చికురన్
జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక
మరున్నారీ శిరోరత్నమున్.

పెద్దన ప్రత్యక్ష వర్ణన గావించినను, రసవంతమైనది. కావుననే పూర్వ కవీశ్వరులనుసరించినను, ఆవర్ణన మనకు నచ్చుచున్నది. ద్వితీయాశ్వాసములో పెద్దన తన అపూర్వ ప్రతిభ, భావనాశక్తి, శిల్పనైపుణ్యము ప్రదర్శించినాడు. అది నాటక పద్ధతిని గలదు. వరూధిని అంగసౌభాగ్యమును, ప్రవరాఖ్యుని సౌందర్యమును వరూధిని మన్మథావస్థలోని భావములతో మేళవించి వర్ణించిన పద్యము పెద్దనార్యుని శిల్పమునంతయు ప్రతిబింబించుకొన్నది.

అబ్బురపాటుతోడ నయనాంబుజము
ల్వికసింపఁ గాంతి పె
ల్లుబ్బిన కన్నీవికల్ వికసితో
త్పల పంక్తుల గ్రుమ్మరింపగా
గుబ్బ మెఱుంగు జన్గవ గగు
ర్పొడువన్ మదిలోన గోరికల్
గుబ్బటిలంగ జూచె నల
కూబరు దన్నిభు నప్పరామయున్.

ద్వితీయాశ్వాసమ్ములో కల బిగువు, శిల్పనైపుణ్యము, తరువాతలేనందున, మనుచరిత్రలో వస్త్వైక్యతలేదనియు, పారిజాతాపహరణము చివరివరకు వస్త్వైక్యతను పాటించిన దనియు విమర్శకుల యభిప్రాయము.

వస్త్వైక్యతలో వ్యక్తమగు వైవిధ్యము శైలియందు ప్రతిఫలించి శైలీ వైవిధ్యమునకు మూలము కల్పించినది. ప్రథమాశ్వాసములో ముఖ్యముగా ద్వితీయాశ్వాసములో పెద్దనార్యుని కవితాశిల్పము, మనోహరమైన పదలాలిత్యము, రసోచితమైన భావప్రకటన, తరువాతి ఆశ్వాసములో సన్నగిల్లి, పాండిత్య గౌరవము, ఆడంబర కవిత్వము, క్లిష్టాన్వయముతో పూర్ణమైనది. తిమ్మనార్యుడు చివరి ఆశ్వాసమువరకు తీయని పలుకు, మధుర శైలినే అనుసరించినాడు. పెద్దనార్యుడు ప్రబంధమార్గమును, అష్టాదశ వర్ణనములతో జత కూర్చినాడు. తిమ్మనార్యుడు అట్టి మార్గము ద్రొక్కినను రసవంతమైన పథమును విడివడలేదు. అందువలన వరూధిని తన రూపవిలాసముతో, శృంగార రసభరితమైన పలుకుదనపు సౌందర్యముతో క్షణకాలము విద్యుల్లతవలె ప్రకాశించి దాగు కొన్నది. సత్యభామ తన అభిమానమును, ఆత్మగౌరవమును తుదివరకు నిల్పుకొని పాఠకుని హృదయములో హత్తుకొని నది. క్షణికమైన ఇంద్రియసౌఖ్యము నపేక్షించు వరూధిని, దాంపత్యజీవిత సుఖము ననుభవించు సత్యభామపాత్రపోషణ కోవి మర్మ మిచ్చుట గ్రాహ్యము.

వరూధిని సత్యభామ పాత్రపోషణమీ దృక్పథము ననుసరించియే జరిగినవి. వరూధిని గంధర్వ స్త్రీ. కామశాస్త్రము ఆమెకు వెన్నతోబెట్టిన విద్య. ప్రవరాఖ్యునివంటి మాఱాంక శశాంకమూర్తివంటి వారి పొందు గోరుట ఆమె జీవితావశ్యము. మన్మథరాజ్య భోగములను భవించి కౌగిలిసుఖము పొందుటయే ఆమెఆశయము. శ్రీకృష్ణదేవరాయలనాటి విలాసమయమైన జీవితము, దాని ననుసరించిన ప్రాపంచిక సౌఖ్యము, అందులో ఇంద్రియ భోగము నపేక్షించు చిత్తవృత్తి వ రూ ధి ని లో రూ పొం ది న వి. ప్ర వ రా ఖ్యు ని ష్ఠ జ యిం చి న ను క వీ శ్వ రు ని కి వ రూ ధినిపై గల అభిమానము దెలియుచున్నది. ఆ సందేశముతో పెద్దనార్యుడు వరూధినిని సృష్టించినాడు. ప్రవరునివలె యింద్రియ నిగ్రహముకల మానవుడు సామాన్యముగా మనము చూచు ప్రపంచములో కన్పించడు. సత్యభామవంటి స్త్రీని మన మనుదినము చూడగలము. స్త్రీ స్వాభావికమైన యలుక సత్యభామప్రత్యేకసొత్తుకాదు. ఆమెవలె ప్రణయకలహమునందు లోనై భర్తను నర్మోక్తులతో, వ్యంగ్య భావములతో దూషించి ఓననిపించుకొను స్త్రీ లెందరో కలరు. వరూధినీ ప్రవరాఖ్యుల ఒక ఆదర్శమును చాటుచుండ, శ్రీకృష్ణుడు సత్యభామల స్వాభావిక జగత్తును చిత్రించుచున్నారు. పాత్రపోషణలో ఆదర్శ స్వాభావిక సృష్టిని పెద్దన తిమ్మనార్యులు గావించి సందేశమును కాంతాసమ్మితముగా లోకమునకు ప్రసాదించి యున్నారు. ఈ సందేశములు వరూధిని సత్యభామలందు గర్భి

తములై యున్నవి. ఉన్నతాదర్శము ఒకవైపు స్వాభావికజగత్తు ఒకవైపు సహృదయులకు సమానమైన ఆనందమునే కల్పించుచున్నది.

వరూధినిలో చిత్రించబడిన గడుసుపోకడలు సత్యభామ నేర్చుకున్నను రావు. సత్యభామ దాంపత్య జీవితమువలని అనుభవమువలన శ్రీకృష్ణుని చిత్తవృత్తిని సరిగా అర్థముచేసుకొని అతనిని వశపరుచుకొనుటలో విజయము సాధించినది. వరూధినికా దాంపత్య జీవితానుభవ మెక్కడిది? ఆమెగంధర్వ స్త్రీ. తన అందమునకు అందరు దాసులౌదురని గర్వించి ప్రవరుని అనుసరించినది. కామశాస్త్రమువలన పురుషుని వశపరచుకొనుటకు, నేర్చిన విద్య లన్నిటిని వినియోగించినది. అతనిలో హృదయ పరివర్తనము గానక, అంగ సౌఖ్యమును కాంక్షించి పైబడి ఓటమి చెందినది. అంగ సౌఖ్యాపేక్ష క్షణికమైనది కావున జయము కలుగలేదు. జీవిత సౌఖ్యము చిరకాలికమైనది కావుననే దానికి ఫలము లభించినది.

వరూధిని గడుసరియైనను అమాయకురాలు. ప్రవరాఖ్యుని అపర మన్మథుగా భావించి హృదయగత వికారమును బేలయై చెప్పివేసినది. వేశ్యయైనను హృదయము ప్రవరునికే అంకితము చేసినది. వరూధిని గడుసుదనములో కొంత అమాయకత్వము, కాఠిన్యములో ఇసుమంత మృదుత్వము, అహంభావములో కొంత నిష్కపటత్వము, గర్వములో కొంత కారుణ్యము కలసి యుండుటవలన ఆమె మన హృదయపూర్వకమైన సానుభూతిని పొంద అర్హురాలగుచున్నది. ఆమె పాత్ర పోషణలో ఔచిత్య అనౌచిత్యములను విడచి ఆమె గడుసుదనమునకు వాక్చమత్కృతికి ఒక పద్య ముదహరింతును.

"ఇంతలు కన్నులుండ దెరు
వెవ్వరి వేడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర
నెపంబిడి పల్కరింత రా
గింతియ కాక నీ వెఱుగవే మును
వచ్చిన త్రోవ చొప్పు నీ
కింత భయంబులే కడు నెల్లిద
మైతిమి మాట లేటికిన్."

ఆమె అహంకారభావము ఎంత గొప్పదో చూతుము.

"చిన్ని వెన్నెల కందు వెన్ను దన్ని సుధాబ్ధి
బొడమిన చెలువ తోబుట్టు మాకు."

...................

తన పాతము ప్రవరాఖ్యునికి వప్పగించినది. కాని ప్రవరుడామె హృదయగత భావమును గ్రహించక తాను పోవు మార్గము చూపి పుణ్యము కట్టుకొమ్మని వేడుకొనును. వరూధిని చకితురాలై:-

"నిక్కము దాపనేల ధరణీసురనందన!"
యింక నీపయిం జిక్కె మనంబు నాకు...."

అని స్పష్టముగా చెప్పివేయ, ప్రవరుడు విప్రసపర్య చిక్కిపోయినదనియు, భుక్తికి వేళ యతిక్రమించినదనియు విచారించును. అతని మాటలకు వరూధిని విన్నదాటు నొంది పలువిధముల ప్రార్థించి:-

"ఎందే డెందము కందళింప రహిచే
నే యాగతశ్రీ నివ్వతికా
జెందుం గుంభగత ప్రదీప కళికా
శ్రీ దోప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబు గను
నా యింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాజమువు
నంతర్బుద్ధి నూహింపుమా."

యని తన పాండిత్యమును, సాంప్రదాయార్థమును బోధించును. అంత వినియు, అవి తుచ్ఛసుఖమనియు, మీసాలపై తేనె యనియు తిరస్కారభావముతో ప్రత్యుత్తరమీయగా వరూధిని హృదయము పట్టలేక, రతి సంరంభము మీర ప్రవరుని గౌగిలించి అతనివలన త్రోయబడినది. ఆమె ఉపన్యాస మంతయువ్యర్థమైనది. ఆమెయందలి అమాయకత్వము నకు ఇందులను కారణము కొంత.

శ్రీకృష్ణుని కొంటెతనమునకు సత్యభామ పలికిన పలుకులు ప్రపంచానుభవయుతములు. ఆమె బెదరింపులు భావగర్భితములు:-

"ఈ నయగారపుం బ్రియము
లీపన లీ మొగమిచ్చమాట లే
లా నిను నమ్మియుండిన ఫలంబిదె
తోడనె కల్గె నాకు నీ
యాన సుమీ నసుం జెనకి
యారడి పెట్టిన నవ్వువారలం
గా నెఱుంగునే పసుల
కాపరి భావజ మర్మ కర్మముల్."

ఆమె హృదయములోని కోపమును దీర్ప

"....నె....................
ప్పాటును పాటుగామి మృదు
పల్లవ కోమల త త్పద ద్వయీ
పాటలకాంతి మౌళి మణి
పం క్తికి వన్నియబెట్ట నా జగ
న్నాటక సూత్రధారి యదు
నందను దర్మిలి మ్రొక్కె........"

వరూధిని సత్యభామల గడుసుదనపు పోకడలోని భేదము సూక్ష్మముగా విచారించినాము. భర్తృ తిరస్కారము పొందిన తరువాత, ప్రవరుని వలని తిరస్కృతిపలన సత్యభామ మరియు వరూధిని ఏడ్చెదరు. ఆ ఏడ్పులోకూడ వరూధిని యందలి నెపముతో కూడిన యమాయకత్వము. సత్యభామ యందలి అనురాగ సహితమైన ఆవేదనకన్పడుచున్నది. వరూధిని:-

"....వేదన నెపంబిడి
యేడ్చె కలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బ చను మిట్టల
నశ్రులు చింద వందగన్."

సత్యభామ దుఃఖము ఇంతకు తీవ్రమైనది.

"..రోసున బుట్టి డెందమున
హెచ్చిన శోక దవానలంబుచే
గాసిలి యేడ్చె ప్రాణవిభు
కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయిఁ
జేల చెరంగిడి బాల పల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ
వధూ కల కాకలీ ధ్వనిన్."

ఏవిధముగానో సత్యభామ కోరిక ఫలించినది. ఆమె ఒక్క లతాంత మాత్రమునకే ఇంత వంత వహించినందులకు పెరటిచెట్టుగా పారిజాత వృక్షము నాటు వాగ్దానము శ్రీకృష్ణుని వలన పొంది తన భర్తకు సత్యభామా విధేయుడను గొప్ప బిరుదు కల్పించినది. వరూధిని అమాయకురాలై ప్రవరుని పొందుగోరి తిరస్కృతయై, మాయా ప్రవరునివలన ఆనందము పొందినది. విప్రలంభ సంయోగ శృంగారము నందలి ఔచిత్య అనౌచిత్య విచారము, రసాభాస విచారము అవసరము లేదు. అలంకారశాస్త్ర, నీతిశాస్త్ర సమ్మతము కాకున్నను, రసాభాసము అనౌచిత్యము గ్రాహ్యములే. నిజముగా విచారించిన మనుచరిత్ర కావ్యములో రసాభాసము కాకున్న పాత్ర పోషణలో మెరుగు ఎక్కడిది? కావ్యసందేశ మెక్కడిది? సత్యభామవలన అనౌచిత్యము జరుగనిచో ఆమె పాత్రపోషణ లోని మెఱుగు తగ్గిపోవుట కవకాశము కలదు. స్త్రీలు వరూధిని వలె ప్రవర్తింపవలయుననికాని, సత్యభామవలె పాదతాడనము చేయవలయుననికాని కావ్యము బోధించునని ఉద్దేశపడుట పొరపాటు. ఆ ఘట్టమును ఆ దృష్టి చే చదువుట అందలి నిగ్గును మరుగు పరుచుటయే యగును. కావ్యానందము అచట మనకు ముఖ్యమైనది. ఒకమాట; మనుచరిత్ర పారిజాతాపహరణములోని అట్టి పద్యములను సహృదయులు పునఃపునః మననము చేయుట ఎందులకు? నీతివిరుద్ధములైన వాటిని విసర్జించుట యుక్తమనుకొనిన, అట్లు జరుగుటలేదు. అందులోని శిల్పమును, రసము చూచి మనము ఆనందము పొందుచున్నాము. మరియొక విషయము. వరూధిని సత్యభామ పాత్రపోషణ లోతును గ్రహించిన తరువాత సహృదయుడు వరూధినియందు మొగ్గు చూపుట విచారింపదగిన విషయము. హృదయమునకు పగ్గములు వేసి ఎంత సూక్ష్మముగా పాత్రపోషణ పరిశీలనము గావించినను సహృదయుని సానుభూతి వరూధినిపై ఏల గంతు వేసి పరుగిడును? ఈ సమస్యను విశదీయుటకు వేరుగా, సమాధానము చెప్పుటకు వలను పడదు. వరూధిని పాత్రపోషణ లోని కళారహస్య మదియే. ప్రవరునిపై అభిమానము ప్రకటించి వరూధిని కామమునుఅణగద్రొక్కిన పెద్దనామాత్యుడు సహితము ప్రకృతిరూపములో వరూధినిపై తనకు గల సానుభూతిని ప్రకటించుట చూడుడు:-

"తరుణీ ననన్యకాంత నతి
దారుణ పుష్ప శిలీముఖ వ్యథా
భర వివశాంగి నంగభవు
బారికి నగ్గము సేసి క్రూరుడై
యరిగె మహీసురాధము డ
హంకృతితో నని రోష భీషణ
స్ఫురణ వహించెనో యన న
భోమణి దాల్చెఁ గషాయ దీధితిన్."

# స్వార్థత్యాగము

బి. రామరాజు, ఎం. ఏ. (ద్వితీయ)

( కటిక దారిద్ర్య బాధవలన మూడేండ్ల కన్నబిడ్డను ఐదురూపాయిల కమ్మిన తల్లి చరిత్ర పత్రికలో చూచి )

1. " హృదయనాడుల రక్తముల్ పిదికి పిదికి
మూడు సంవత్సరములు కాపాడి తుదకు
ఘోరదారిద్ర్య బాధా నివారణమున
కై దురూకల కమ్మినా వమ్మ నీవు. "

2. " కరువనుచు ప్రభుత్వాలన్ని గంట గొట్టి
ధరలతోబాటుగా దండధరుల బెంచ
రెండు రూకలె లాభమా ముండమోపి
మొదలు చెడినట్టి బేరాన మోసమయ్యె. "

3. " ఎడ్డిబావుల దాని వంచేర్చి యేరి
కోమటెవ్వడొ సస్తాగ గొట్టినాడు
మూరు బేరాన లాభ మేమాత్ర ముందొ
కాస్త కనిపెట్టి ఇకముందు గట్టిపడుము."

* * * *

4. " గుండె తడిలేని స్త్రీ యని గుసగుసలుగ
భారతాదర్శమున కిది భంగ మనగ
వట్టి బూటక మనుమను రొట్టవేయు
వివిధ వివిధములుగ చెప్ప వింటినమ్మ. "

* * * *

5. " పట్టినే కాదు పో తాళి గట్టి నట్టి
సాధ్వి సహధర్మచారిణి స్వార్థమునకు
సత్యపరిపాలనంబను సాకు బెట్టి
వీధిలోబెట్టి వేలము వేసినట్టి
ఆ హరిశ్చంద్రు జనము లహో యటంచు
నేటికివి పూజసేతు రానాటినుండి. "

6. " గొప్పవారలు చేసిన తప్పులైన
యొప్పులగు గాని బీదల యొప్పులైన
తప్పులని రుద్దుచుందురు తలలపైన
బడితె ఎవనిదో వానిదే బఱ్ఱె సుమ్ము."

7. " బిడ్డ నమ్మగా నీ హృదిపడ్డ బాధ
స్వార్థలోలుర కే మర్థమగును తల్లి
రవియు కాకున్నచో మఱి కవియు గాని
పంచుకొందురు నీబాధ నించుకైన. "

8. " తినుట కొక పూటకును లేని దీనవగుట
పట్టమైనను ఇక సుఖంపను నటంచు
కనియు పెంచిన మమతల కడకు త్రోసి
నట్టి స్వార్థరాహిత్యంబు నరయరెవరు. "

9. " బట్ట పొట్టకు లేని నిర్భాగ్య లిండ్ల
మఱచి పుట్టకు జన్మ జన్మాలకైన
అనుచు వీడ్కోల్పి కంటి నీ రద్దికొనుట
ధరణి భరియింపలేదను దయయొ ఏమొ? "

10. " పడతి నీ మది లేచు తుపాను వలన
ధరణిదేవత హృదయంబు తల్లడిల్లె
కానిచో నిన్న మొన్ననే కలిగినట్టి
అచ్చటచటి భూకంపాల కర్థమేమి? "

11. " చేతనులకు నీయెడ సానుభూతి లేమి
ప్రకృతి ఎంతెంత సంతాప పడెనొ యేమొ?
హృదయ పరితప్త దుఃఖాశ్రు నదులు పొరల
క్రుంగి కుమిలెను పర్వత పుంగవుండు, "

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఉస్మానియ విశ్వవిద్యాలయ

# ఆంధ్ర విద్యార్థిసంఘము

# నివేదిక 1950

ప్రపంచములో చైతన్యముగల ప్రతి వస్తువు పరిణామము బొందుచునే యుండును. ఒక వ్యక్తికి పరిణామ మెట్లు సహజమో అట్లే జాతి, సంస్థ మరియు తదితర జడములుగా గనుపట్టు పర్వతములు సయితము భౌతిక చక్షులకు గోచరించని ఏదో అంతర పరిణామమును బొందుచుండును. దీనికి కాల ప్రవాహమే కారణము.

ఈసంవత్సరము మన విశ్వవిద్యాలయములో పెక్కు గణనీయములైన పరిష్కారములు జరిగినవి. అందులో ముఖ్యముగ యితర విద్యార్థి సంఘములందువలెనే ప్రాంతీయభాషా సంఘములందును విద్యార్థియే యధ్యక్షుడుగా నుండుటకు అధికారివర్గ మామోదించినది.

## ఎన్నికలు

ఆంధ్ర విద్యార్థి సంఘ ఎన్నికలు తేది 3—8—50 గురువారమునాడు జరిగినవి. కార్యనిర్వాహకవర్గ మీ విధముగ యేర్పడినది.

అధ్యక్షులు:—బి. రామరాజు (ఎం. ఏ. ద్వితీయ)
ఉపాధ్యక్షులు:—సాంబమూర్తి (బి. ఏ. ద్వితీయ)
కార్యదర్శి:—వి. రామకృష్ణారావు (ఎం. ఏ. ప్రథమ)
సహాయ కార్యదర్శి:—సి. హెచ్. లక్ష్మీనరసింహారావు (బి. ఏజి. ద్వితీయ)
కోశాధికారి:—పి. సూర్యప్రకాశరావు (ఎల్.ఎల్.బి.) ప్రథమ.

అతదుపరి వివిధతరగతుల ప్రతినిధుల నియామకము 14 ఆగస్టు సోమవారము సాయంత్రము జరిగినది.

ఈ క్రింది విద్యార్థులు తరగతివారీ ప్రతినిధులు:—

వి. రమణరావు. డి. అప్పారావు. పి. లక్ష్మీనరసింహారావు. పి. వెంకటరెడ్డి. రామచంద్రరావు. వి. నరసింగరావు. మధుసూదనరెడ్డి. రామకృష్ణారెడ్డి. పి. నారాయణరావు. నారాయణరెడ్డి. కృష్ణమూర్తి. వి. నరసింహారావు. వి. మురళీధరరావు. సత్యనారాయణరావు.

31 ఆగస్టు గురువారము మధ్యాహ్నము 2 గంటలకు ప్రతినిధుల సమావేశము జరిగినది. ప్రారంభోత్సవమును గురించిన కొన్ని ముఖ్యాంశములు చర్చింపబడినవి.

## ప్రారంభోత్సవము

పై సంఘాధ్యక్షులగు బి. రామరాజుగారి యధ్యక్షతన విద్య, భూమ్యాదాయశాఖా మంత్రులు శ్రీ. గౌ॥ బూర్గుల రామకృష్ణారావు పంతులుగారు ప్రారంభోపన్యాసమును ప్రసాదించిరి. నాటిముఖ్య కార్యక్రమములలో పూర్వాచారముగు "మధుపర్క-సన్మానము" ను ప్ర ప్రథమముగ కళాశాలలో ప్రవేశపెట్టుట యొకటి. ఈ ప్రాచీన సాంప్రదాయముయొక్క ప్రత్యేకతనుగురించి ఆచార్య శ్రీఖండవల్లి లక్ష్మీరంజనముగారు సభికులందరికిని యెఱుకపఱచిరి.

## సమావేశములు

పై సమితి అధ్వర్యమున 17—10—50 మంగళవారము మధ్యాహ్నము 1 గంటకు తెలుగు గదిలో "ఐక్యరాజ్య సమితివారి కొరియాపట్ల ప్రవర్తన ప్రశంసనీయమా?" యను శీర్షికపై వాగ్వివాదము జరిగినది. సభ దిగ్విజయముగా కొనసాగినది.

2 నవంబరు మధ్యాహ్నము 1 గంటకు సంఘాధ్యక్షుల అధ్వర్యమున శ్రీ కురుగంటి సీతారామభట్టాచార్యులవారు "పవిత్రసామగ్రి" యను శీర్షికపై చక్కని ఉపన్యాసమును ప్రసాదించిరి.

23–11–50 గురువారము మధ్యాహ్నము పై సంఘపక్షమున నొకయసాధారణ సమావేశము జరిగినది. బ్రహ్మశ్రీ వెల్లలూరు వెంకటరాఘవశర్మగారు (ఆంధ్రోపన్యాసకులు) సంగీత సాహిత్యములకు గల సంబంధ మెట్టిదో క్షుణ్ణము(గ) దెలిపిరి.

తేది 25 నవంబరునాడు శ్రీ వల్లూ(రి) సూర్యనారాయణరావుగారి "రోలింగ్ కప్" తెలుగు వక్తృత్వ పోటీ నిజాంకళాశాలలో జరిగినది. హైదరాబాదు నగరములోని ప్రతి కళాశాలనుండి యిద్దరు విద్యార్థులు పోటీలో పాల్గొనిరి. మన విశ్వవిద్యాలయమునుండి శ్రీ మాటూరి నరసింహారావు డి. అప్పారావుగారలు పోటీలో పాల్గొని ప్రథములుగా నెగ్గిరి. వారికినంఘముతరుపున మా ప్రత్యేకాభినందనలు.

ఈ సంవత్సరము విశ్వవిద్యాలయములో మన ఆంధ్ర

విద్యార్థిసంఘము మిక్కిలి గౌరవస్థానము నాక్రమించుచున్నది. కార్యవర్గసభ్యులు, ఇతర కార్యకర్తలు సంఘముపట్ల శ్రద్ధయు, సహకారభావమును ప్రకటించుచున్నారు. ముందు ముందు సయితము ఇదేవిధముగ విద్యార్థులందఱును ఉత్సాహముతో కార్యభారమును నిర్వహింతురని నమ్ముచున్నాను.

## ఆంధ్రాభ్యుదయోత్సవములు

వివిధ కళాశాల ఆంధ్ర విద్యార్థి కేంద్రసంఘ పక్షమున పై ఉత్సవములు డిసంబరు (9. 10. 11.) 1950 తేదీలందుజరిగినవి. ఈయుత్సవములు ఉస్మానియ విశ్వవిద్యాలయ ఆవరణముననే జరుగుట కడు ముదావహము.

ఆసందర్భమున విజ్ఞుల మహోపన్యాసములు, కవిసమ్మేళనము, ఏకాంకికా ప్రదర్శనముల పోటీలు, సంగీత పోటీలు, వక్తృత్వ, వ్యాసరచనపోటీలు మున్నగునవిజరిగినవి.

9—12—50 నాఁడు సాయంత్రము 4 గంటలకు మ॥రా॥శ్రీ॥ గౌ॥ బూర్గుల రామకృష్ణారావుగారు ప్రారంభోపన్యాస మొసఁగిరి.

శ్రీ. పర్సా వెంకటేశ్వరరావుగారి యధ్యక్షతన "భారతదేశము-అంతర్జాతీయ రాజకీయములు" అను శీర్షికపై ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు ఉపన్యసించిరి. ఏకాంకిక "వాపస్" విశ్వవిద్యాలయ విద్యార్థులును, "నైవేద్యం" విమెన్సు కాలేజి విద్యార్థినులును ప్రదర్శించిరి.

10—12—50 నాఁడు సాయంత్రము 4 గంటలకు శ్రీ. ఇల్లిందల రామచంద్రరావుగారి యధ్యక్షతన కవిసమ్మేళనముజరిగినది. ఆసందర్భమున, శివభారతరచయితలగు, మహాకవి, శతావధాని, శ్రీ. గడియారము వెంకటశేషశాస్త్రిగారు పుపన్యసించిరి.

శ్రీయుతులు వానమామలై వరదాచార్యులు, దాశరథి కృష్ణమాచార్యులు, కాళోజి నారాయణరావుగార్లు మొదలగు తెలంగాణ సుప్రసిద్ధ యువకవులు తమ రచనలను వినిచిరి. చాదర్‌ఘాట్ నిజాంకళాశాలల విద్యార్థులు ఏకాంకికలను ప్రదర్శించిరి.

11—12—50 నాఁడు సాయంత్రము 5 గంటలకు "దేశ భాషలందు తెలుగు లెస్స" యను శీర్షికపై శ్రీ వెల్లఌరు వెంకటరాఘవశర్మగారు (ఎం.ఓ.యల్.) ఉపన్యసించిరి.

సిటీకాలేజి, మహబూబుకాలేజి విద్యార్థులు ఏకాంకికల ప్రదర్శించిరి. పోటీలలో ప్రథములుగా నెగ్గినవారికి, నాఁటి సభాధ్యక్షులైన శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు బహుమతుల నొసఁగిరి.

ఏకాంకికా ప్రదర్శనముల పోటీలలో ఉస్మానియ విశ్వవిద్యాలయ విద్యార్థులు ప్రదర్శించిన "వాపస్" ప్రథమ బహుమానమును పొందినది. అందులో పాల్గొనిన విద్యార్థులందఱును అభినందనీయులు.

కార్యదర్శి కృతజ్ఞతలతో సభలు దిగ్విజయముగ కొనసాగినవి.

—వెల్దుర్తి రామకృష్ణారావు.(కార్యదర్శి)

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయ్?
ఒకరి మేల్ తన మేల నెంచే
నేర్పరికి మేల్ కొల్ల లోయ్!

—గురజాడ

# ★ గ్రంథసమీక్ష ★

## ప్రత్యూష

(వివిధ రచయితల పద్యసంకలనము)

ప్రకాశకులు: సాధనసమితి (హైద్రాబాదు)

వెల: రూపాయిన్నర.

సాధనసమితి తెలంగాణములోని సాహిత్య సంస్థలలో ప్రఖ్యాతిగన్నది. 'ప్రత్యూష'యను పద్య సంకలనకావ్యము. పైసమితియొక్క పదునెనిమిదవ కుసుమము. నేటిసాహిత్యములో పేరెన్నికగన్న వివిధ రచయితల ఉత్తమపద్యములు ఇందులో కూర్చబడినవి. రచయితల పద్యములు ఒకేతీరునలేవు. ప్రత్యేక భావశక్తి, ప్రత్యేక కవితావస్తువుగల వివిధ పద్యము లిందుకు తార్కాణము. భావకవిత్వమును కొందరు వాస్తవికతను కొందరు ఆరాధించినారు. కొందరు కవులు భావాంబరవీధులలో స్వేచ్ఛావిహార ము సలిపినారు. మరికొందరు కవికుమారులు ఊహాగానముచేసినారు. ఈనవ్యకవులకు మాతృభూమి పవిత్రమైనది. ముఖ్యముగా రెండు శతాబ్దములవరకు దీప్తినిప్రపొందిన తెలంగాణముయొక్క భావి ఔన్నత్యము వీరిదృష్టిని ఆకర్షించినది. నవ్యకవులకు ప్రకృతి ఆరాధ్యదేవత. ప్రకృతిని ఆరాధించు మార్గము. ప్రకృతివలన మానవుడు పొందుసౌఖ్యము, ఈపద్య ములలో గాంచనగును. ఆంధ్రుల ప్రాచీనౌన్నత్యమును కీర్తించుచు, తెలుగువారికి భావికర్తవ్యబోధనము గావించు కవికుమారులు సమయానుకూలముగా, ముకుళితములైన హృదయసుములను విప్పార జేయుటలోకృతకృత్యులైనారు. తెలంగాణ ఆంధ్రులకు చిరకాలము రాజకీయముగా, సాంఘికముగా, సాంస్కృతికముగా ముఖ్యస్థానమైనది. ఇచ్చటి కాక తీయుల పరిపాలన, ఓరుగల్లు వైభవము స్మృతి పథమునందుంచుకొని కవితాగానముచేసినారు. వీరి రచనలలో అనుకరణములులేవు. శైలిలో, భావాలలో, శిల్పములో నవ్యత్వము, ఉదాత్తత విశేషముగా గోచరించుచున్నది. వివిధ కావ్యవస్తువులుగల ఈ పద్యసంకలనము ఆంధ్రుల రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక జీవితమును ప్రతిబింబితము చేయు చున్నది. నవ్యాంధ్ర సాహిత్యమును ఆరాధించుట లోను, సాహిత్యమునకు నూత్నతేజము ఒసఁగుట లోను తెలంగాణ కవికుమారులు తమప్రతిభ చక్కగా ఈ గ్రంథరూపమున లోకమునకు చ నారు. ఆంధ్రపితామహుల ఉపోద్ఘాత వాక్యము ప్రత్యూషకాక నూత్నశోభనుగూర్చినవి.

సాధనసమితివారు ఇట్టిప్రత్యేక లక్షణము గ్రంథమును ప్రచురించి చక్కని కృషిసలిపినా వారిసాధన ఫలించుననుటలో ఏమాత్ర అతిశయోక్తిలేదు.

---

## రుద్రవీణ

ఖండకావ్యము

గ్రంథకర్త: దాశరథి కృష్ణమాచార్యులు.

ప్రకాశకులు: శ్రీరామ అండ్ కో (తెనాలి)

వెల: రూపాయి.

'దాశరథి' తెలంగాణ వాసులకు క్రొత్తకా ఈతని హృదయములో అణగియున్న కవితాశ ఇపుడు సంపూర్ణవికాసము నొందినది.

ఇంతకుపూర్వము "సాహితీమేఖల" వా దాశరథి రచనలను సంపుటీకరించి 'అగ్నిధా యనుపేర గ్రంథమును ప్రచురించినారు. ఇపు మరికొన్ని రచనలను మరొక సంపుటిగా "రుద్రవీ పేరుతో "శ్రీరామా & కో" ప్రకాశకులు ప్రచురి నారు. సంఘంలో జరుగుచున్న అల్లకల్లోలము పీడిత ప్రజాహృదయమునుండి వెడలు బాధలు ఈ హృదయమున హత్తుకొని 'రుద్రవీణ' యను కా రూపముపొందినవి. తెలంగాణ అతని హృదయ లో జీర్ణమైనది.

దాశరథియే తెలంగాణము, తెలంగాణ దాశరథి. అతని హృదయము సర్వదా తెలంగా కీర్తించును, కావుననే:

"నాడునేడును తెలంగాణమోడలేదు
శత్రువుల దొంగవాడికి శ్రావణాభ్ర
మటుల గంభీర గర్జాట్టహాసములను
నాతెలంగాణ పోవుచున్నది పధాన".

అని సగర్వముగ కంఠమెత్తిపాడుకుంటాడు.

శ్రామికునివేడి నిట్టూర్పులకు ప్రపంచ
మెన్నడో కాలిబూది కాసున్నదేమొ!

అని ఊహిస్తాడు.

"లేదు, లేదుచల్లారగాలేదు, పేద
వాని గుండియలోని స్మశాన వహ్ని
కాల్చివేయును, బంగారు గద్దెలెక్కి
పేదలను సిగరేట్లుగా పీల్చువారి''.

అని శ్రామికుని, హృదయవిదారకమైన జీవితమును వర్ణించివర్ణించి ఆతనికి నూత్నోత్సాహము నొసంగును.

''చింతల తోపులో కురియు
చిన్కులకుఁ తడిముద్దయైన బా
లెంత యొడిఁశయించు పసి
రెక్కల మొగ్గను వోనిబిడ్డకుఁ
బొంతలులేవు కప్పుటకు:
బొంది హిమంబయి పోవునేమొ: వా
యింతును రుద్రవీణ పయి
నించుక వెచ్చని అగ్నిగీతముల్॥''

దాశరధి తనరుద్రవీణను సద్వినియోగము జేయుటకుమాత్రమే ప్రయోగించునట!

ఇంతచిన్న వయసులో అసాధారణ ఉపజ్ఞను, ప్రతిభను చూపుచు ముఖ్యముగ తెలంగాణ యువక హృదయములను చూఱగొన్న అభ్యుదయకవిచక్రవర్తి కవిసింహ, మహాకవి మొదలగు బిరుదాంచితులైన, శ్రీమాన్ దాశరథి కృష్ణమాచార్యుల "రుద్రవీణ" నానావిధ వాణీరుచుల చూపునట్టి అద్భుతమైన ఖండకావ్యం. ఈ కావ్యము మూడున్నరకోటి ఆంధ్రుల మెప్పువడసిన అత్యుత్తమ కావ్యమని చెప్పనగును.



